# THE ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY DEBATES

[*Part II—Proceedings other than Questions and Answers*]

## OFFICIAL REPORT

---

*Sixteenth Day of the Sixth Session of the Andhra Pradesh Legislative Assembly*

---

## ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY

*Friday, the 14th November*, 1957

The House met at Half Past Eight of the Clock

[MR SPEAKER IN THE CHAIR]

## QUESTIONS AND ANSWERS

(SEE PART I)

## ELECTION OF ONE MEMBER TO THE ZONAL RAILWAY USERS' CONSULTATIVE COMMITTEE OF SOUTHERN RAILWAY

*Mr. Speaker* "I have to announce to the House that in the election of a Member to the Zonal Railway Users' Consultative Committee of the Southern Railway, Sri B P Sesha Reddi, M L.A. has been declared duly elected"

## EXPUNCTION OF SOME PORTION FROM THE OFFICIAL RECORDS OF 2nd NOVEMBER 1957

మిస్టర్ స్పీకర్ : గౌరవసభ్యులు శ్రీ కె. సుబ్బారావుగారు శాసనసభ చర్చలలో ఒక కులము వారిని గురించి చెప్పినారు దానిమీద ముఖ్యమంత్రి గారు, ఒక community గురించి అట్లా చెప్పటం భావ్యంకాదని అన్నారు ఆ సమయమందు యిక్కడ డిప్యూటీ స్పీకరుగారు కూర్చొని యున్నారు వారు దానిపై ఏ ruling యివ్వకుండా pending గా ఉంచారు ఒక కులమువారి విషయం ఆ విధంగా యిక్కడ చెప్పవలసిన, అవసరంలేదు. ఎవరైనా దానిని గురించి complain చేస్తారనికాదు, అసలు మనకు ఎందుకు అసంతృప్తి ఉండ

వలెను ? ఇప్పుడు Monogamy Act కూడా వచ్చింది ఇది భారతదేశమున కంతకూ వర్తిస్తుంది కనుక ఆ కులమువారినిగురించి చెప్పినది ఈ సభ records లోనుంచి expunge చేస్తున్నానని ప్రకటిస్తున్నాను దానిని గురించి ఎక్కువ చెప్పనక్కరలేదు గౌ సభ్యులుకూడ ఏమీ చెప్పనక్కరలేదు. ఇది యితరులు కోరుతున్నారని, మెంబర్సును "మీరు ఎందుకు చెప్పారని" అనను మిగతా విషయాలన్నీ నా jurisdiction లోనివి కావు

శ్రీ కె సుబ్బారావు (హిందుపూర్ - జనరల్) అధ్యక్షా ! ఇది సభ్యుల హక్కులకు సంబధించిన విషయము అది మీరు expunge చేసుకొనవచ్చును. అధికారం ఉన్నది. మీకు సర్వంసహా చక్రవర్తిత్వం ఉన్నది అది ఎవరూ ప్రశ్న చేయుటకు వీలులేదు కాని 'మే పార్లమెంటరీ ప్రాక్టిస్' లో యీ ప్రకారం ఉన్నది.

"That the freedom of speech and of debate and proceedings in the Parliament ought not to be impeached or questioned in any place outside the Parliament "

ఎవరో దారినపోయే దాసరయ్య వ్రాసినాడని, మీరు యీ విధంగా చేయుట ధర్మముకాదని చెవుతున్నాను. గౌ. సభ్యుల హక్కులను కాపాడ వలసిన మీరు యీ విధముగా చేయుట న్యాయముకాదు

మిష్టర్ స్పీకర్ : నేను ఎవరు వ్రాసిన దానిమీద ఆధారపడి చేయలేదు. నేను ఆలోచించి చేసినాను ఈ విషయం డెప్యూటీ స్పీకరుగారు పెండింగ్‌గా ఉంచినారు. అందువల్ల యివాళ final decision తీసుకొన్నాను నా అధికారం లోనే నేను ఉన్నాను నేను గౌ. సభ్యుల హక్కులు కాపాడవలెను నా హక్కులుకూడ ఉన్నవి. Speaker's right is to say whether a particular statement is parliamentary or not.

ఒక కమ్యూనిటీని గురించి ఏ సభ్యులైనా చెప్పినది irritating గా ఉన్నదని స్పీకరుకు తోచినచో, దానిని రికార్డునుంచి expunge చేసే అధికారం ఉన్నది కనుక, మే పార్లమెంటరీ ప్రాక్టిస్ ప్రకారం, లోకసభ సాంప్రదాయ ప్రకారం, నేను నా హక్కులు చెలాయించాను. (హర్షం) అందువల్ల ఏ గౌ మెంబరు యొక్క హక్కులకు వ్యతిరేకంలేదు. ఇక దీనినిగురించి చర్చ లేదు.

శ్రీ కె సుబ్బారావు అధ్యక్షా తీసివేయుటకు మీకు అధికారము ఉన్నది కాని మీరు ఎవరోఒకరు కావలినుంచి వ్రాసినారని మీరు నాకు వ్రాస్తూ యీ కాగితమును పంపించినారు ఇది ఒక తప్పు మీరు మాకు అధికారిగా యీ సభకు అధ్యక్షులుగా ఉండి, ఆ సమయంలో మీరు స్వయంగా అధ్యక్ష పీఠములో లేని సందర్భములో, ఎవరో వ్రాసినారని మీరు నాకు చెపుతూ, ఆ భాగమును తీసివేయుట సభ్యుల హక్కులకు భంగకరమని చెపుతున్నాను

మిస్టర్ స్పీకర్ వారు వ్రాసినది మీకు ఊరికే పంపించినాను కాని దాని రిఫరెన్సే చేయలేదు ఆ రోజున జరిగినచర్చ నేను వింటూనేయున్నాను ముఖ్య మంత్రిగారు object చేసినారు ఆ విషయం డిప్యూటీ స్పీకరుగారు పెండింగుగా ఉంచినారు

I am not basing anything on the complaint of anybody Anyhow, I find that a final decision has to be given The final decision is that it is not parliamentary and therefore it should be expunged.

శ్రీ ఎ. బి నాగేశ్వరరావు (రాజమంద్రి) అది వ్రాసిన గౌరవ సభ్యులు ఎవరు ?

మిస్టర్ స్పీకర్ అది గౌ సభ్యులకు అనవసరము అది వారికి, నాకు మధ్య జరిగినది. అందువలన వారు చెప్పినారు చెప్పుటకు వారికిహక్కు ఉన్నది దానికి నేను జవాబు చెప్పినాను

శ్రీ రాజా సాగి సూర్యనారాయణరాజు (నర్సీపట్నం-జనరల్) అధ్యక్షా, అది ప్రయివేటు వ్యవహారమా ? ఎవరికీ తెలియకూడదా ?

మిస్టర్ స్పీకర్ . గౌ॥ సభ్యులకు తెలుపవలసిన relevant విషయాలు తెలుపుతాను. irrelevant అయితే తెలుపను

శ్రీ ఎ. బాపినీడు (కొవ్వూరు-జనరల్) . అధ్యక్షా, అందరికీ తెలియని విషయాలుంటవి. మీకు తెలియని విషయములుకూడ రుజువు అడిగి expunge చేస్తారా ? అసలు ఆ విషయం డిప్యూటీ స్పీకరుగారికి బాగా తెలుసునా, ఆ కమ్యూనిటీలో ఆ custom ఉన్నదో లేదో వారికి తెలియునా ? అది ఒక community ఆచారం కొన్ని కులములలో నాలుగు పెళ్ళిళ్ళు చేసు

కుంటారు విడాకులు యిచ్చుకుంటారు ఆచారం ఉన్నది ఆ విషయం enquiry చేయకుండా తప్పు మాట్లాడినారని expunge చేయుట గా సభ్యుల హక్కులకు భంగముకాదా అని అడుగుతున్నాను

మిస్టర్ స్పీకర్ హక్కులకు భంగముకాదు స్పీకరు commonsense ఉపయోగించవలెను ఏడు మనువులు, నాలుగు మనువులు అనేది గౌరవప్రదమైనది కాదు కనుక, అయినా అది ఉన్నా లేకపోయినా భారతదేశం మొత్తానికి వర్తించే అట్లు వచ్చింది కనుక నేను దానిని తీసివేస్తున్నాను I consider it as irrelevant and unparliamentary. I have used my discretion and commonsense

శ్రీ కె సుబ్బారావు ఇది unparliamentary అంటే ఒప్పుకొనను. Obscene అంటే ఒప్పుకొంటాను ఈ ఆచారం ఆ కులములో ఉన్నదని నేను రుజువు చేయగలను

మిస్టర్ స్పీకర్ Obscene అంటే మీకు కోపము వస్తుందని 'unparliamentary' అన్నాను. 'Obscenity' అనమంటే నాకు అభ్యంతరం లేదు ఇంతటితో దీనిని close చేస్తున్నాను

## BUSINESS OF THE HOUSE

మిస్టర్ స్పీకర్ శ్రీ ఎల్లమందా రెడ్డిగారు, వెంకటేశ్వర్లుగారు రూల్సుకు సవరణలు పంపినారు, బిజినెస్ కమిటీలో పెట్టి ఎప్పుడు తీసుకొనేది నిర్ణయిస్తాము వారు టైములోనే పంపినారు.

శ్రీ పిల్లలమఱ్ఱి వెంకటేశ్వర్లు (నందిగామ) Education కు సంబంధించిన subject మీద రెండుగంటలు చర్చకు టైము కావలెనని కోరుతూ మీకు ఒక జాబు వ్రాసినాము దాని విషయం తెలియజేయగలరా ?

మిస్టర్ స్పీకర్ . తరువాత వస్తుంది.

శ్రీ జి. ఎల్లమందారెడ్డి (కనిగిరి) : నేను Adjournment Motion పంపి మూడు రోజులయినది. ఎప్పుడు వస్తుందో తెలియజేస్తారా ?

మిస్టర్ స్పీకర్ : వరుసగా వస్తాయి. ఇప్పుడు రెండు Adjournment Motions వచ్చినవి. ఒకటి శ్రీ వి. విశ్వేశ్వరరావుగారు యిచ్చినారు.

## ADJOURNMENT MOTION RE NOTICE OF STRIKE GIVEN BY HIGHWAYS EMPLOYEES UNION OF ANDHRA PRADESH

*Mr Speaker* Sri V Visweswara Rao has given notice of an adjournment motion which is as follows.

"The House stands adjourned to discuss the matter of most urgent public importance viz, the impending strike notice given by the Highways Employees Union of Andhra Pradesh on 25-10-1957 for not redressing their grievances for the past two years such as increase of dearness allowance of Rs 6, recollection of such amounts from Nizamabad Division (2) Boy cooly system, though abolished not paid to the mazdoor coolies, (3) Payment of gratuity to the workers"

I request the hon Minister to state at what stage it is and what the Government are going to do in the matter

శ్రీ వి. విశ్వేశ్వరరావు (మైలవరం) అధ్యక్షా, 8 వ తేదినాడు కార్మికులు సమ్మె చేస్తారని, **most important** అని, యీ మోషన్ 5 వ తేదిన యిచ్చాను ఈ బాయ్‌కూలీ సిస్టమును రెండు సంవత్సరములనాడు ప్రభుత్వం రద్దుచేసింది ఆ కార్మికులకు 40, 50 సంవత్సరముల వయస్సు వచ్చినప్పటికీ, వారికి 'Boys' అని పేరుపెట్టి అదేకూలీ యిస్తున్నారు అది సరైనపద్ధతి కాదని మంత్రిగారి దృష్టికి రెండు సంవత్సరములనుంచి తీసుకు రాబడుతున్నది ఈ ప్రభుత్వం ఏర్పడిన తరువాత సుమారు 10 మాసములనుంచి ప్రభుత్వ దృష్టికి ఈ విషయం తీసుకువచ్చాను మార్చిలో మంత్రిగారిని కలుసుకొని వారికి ఈ విషయంలో స్పష్టంగా ఒక మెమోరాండం యివ్వడం జరిగింది తరువాత వారితో మళ్ళీ సంభాషించుట జరిగింది సెప్టెంబరులో ఒకసారి మాట్లాడాము. ఈ విధంగా ఆరేడు పర్యాయములు వారితో మాట్లాడినప్పటికీ ఏమీ చర్య తీసుకొనలేదు. అదేకూలి యిస్తున్నారు

**"Payment of retrenchment gratuity"** అన్నది ఇదివరకు ఇక్కడ ఉన్నది. ఆవిషయంకూడ మంత్రిగారి దృష్టికి తీసుకురావటం జరిగింది. అది ఇప్పుడు సక్రమంగా అమలు జరగటంలేదు కూలీలకు న్యాయంగా గ్రాట్యుటీ ఇవ్వాలని ఇదివరకే ట్రిబ్యునల్స్ అంగీకరించినప్పటికీ, అవి సక్రమంగా అమలు జరగటం లేదని ప్రభుత్వదృష్టికి తీసుకువస్తున్నాను ప్రభుత్వ ఉద్యోగస్థులకు ఇచ్చే డియర్ నెస్ ఎలవెన్సు కార్మికులకుకూడ ఇవ్వాలని ట్రిబ్యునల్స్ చెప్పాయి. మొదట్లో మూడు నెలలు ఇచ్చారు. తరువాత అవి ఆపేశారు మూడునెలలు ఇచ్చినవి

కూడ తిరిగి వసూలు చేయుటానికి ప్రయత్నించటం జరుగుతున్నది. నిజామాబాద్ జిల్లాలో, ఇతర ప్రాంతాల్లో ఆవిధంగా వసూలు చేయాలని ఆర్డర్సు పంపించటం జరిగింది "ఇదివరకు ఇచ్చినవి ఇచ్చాము, మళ్ళీ వసూలు చేయటం గురించి పునరాలోచిస్తాము" అని ఫైనాన్స్ మినిష్టర్‌గారు చెప్పారు కాని వసూలు చేయటం మాత్రం జరుగుతోంది ఆ విధంగా తిరిగి వసూలుచేయటం సరైందికాదని చెప్తున్నాను

అనేక ప్రాంతాలలో, బంగళాలలో ఉండే స్వీపర్సు, వాచమన్లు చాలా ఇబ్బందులు పడుతున్నారు వారి ఇబ్బందులు తొలగించమని ప్రభుత్వదృష్టికి తీసుకువచ్చాము వారి ఇబ్బందులు తొలగించటానికి ప్రభుత్వం అంగీకరించింది హైవేస్ చీఫ్ ఇంజనీర్, డిపార్టమెంటల్ సెక్రటరీలతో జరిగిన సమావేశంలో వీటన్నింటిపైన వెంటనే ఆర్డర్సు పంపిస్తామని చెప్పారు ఈ విధంగా చెప్పి, పది నెలలు అయినా ఇంతవరకు ఎలాంటిచర్య తీసుకోకపోవటం సరైనదికాదు, అని కార్మికులు తమ, తీవ్రమైన అసమ్మతి తెల్పటానికి ఆవిధంగా చేశారు కాబట్టి, ఆ విషయాన్ని చర్చించవలసిందిగా కోరుతూ నేను మోషన్ ఇచ్చాను

* రాకపోకల శాఖమంత్రి (శ్రీ యం. నరసింగరావు) అధ్యక్షా, ఇది ఎడ్జర్న్‌మెంట్ మోషన్ అని నేను అంగీకరించను ఇది చర్చకు రాకూడదని మనవి చేస్తున్నాను ఇప్పుడు ఉన్న విషయం మనవిచేస్తాను మొదట ఆరు రూపాయల విషయం ఉన్నది దీని విషయంలో

"The question of ad-hoc increase of Rs 6 in dearness allowance is under the consideration of the Government Necessary information which was called for by the Finance Department has been collected and transmitted to them "

ఈ స్టేజిలో ఉన్నది ఇచ్చినడబ్బు మళ్ళీ వసూలు చేస్తున్నారనికూడా చెప్పారు. హైదరాబాదు డిస్ట్రిక్ట్‌నుండి, ఇంకా ఒకటి రెండు డిస్ట్రిక్ట్సునుంచి ఇన్‌ఫర్మేషన్ నా దగ్గరకు వచ్చింది ఆ విధంగా వసూలు చేయకూడదని గవర్నమెంటునుండి ఆర్డర్సు పోయాయి. తుది నిర్ణయం అయ్యేవరకు ఇచ్చిన డబ్బు వసూలు చేయకూడదు అని ఆర్డర్సు పోయినాయి నిజామాబాద్ విషయం నా దృష్టికి రాలేదు. కాని గవర్నమెంటునుంచి జనరల్ ఆర్డర్ చీఫ్ ఇంజనీర్‌కు వెళ్ళింది అని మనవి చేస్తున్నాను.

తరువాత, బాయ్‌కూలి సిస్టమ్ గురించి చెప్పారు ఈ సిస్టమ్ ఇదివరకు తెలంగాణాలో ఉండేది రెండు సంవత్సరాలకు ముందు, ఆ సిస్టమ్‌ను తీసి వేసిన విషయం నిజము బాయ్‌కూలి సిస్టమ్ తీసివేసిన తరువాత, వారికి మెన్ కూలీ జీతం దొరకాలని గౌ సభ్యులు అంటున్నారు వారు చెప్పినట్లు చేయటానికి కష్టముఉన్నది ఆ విధంగా కాజాలదని మనవి చేస్తున్నాను అసలు విషయం ఇది

"Necessary instructions have already been issued to all the Divisional Engineers of Telangana to stop the practice of employing boy coolies and to promote the existing ones to the vacancies of men mazdoors The existing boy-coolies will be absorbed in the vacancies of men mazdoors as and when they occur and hence the question of payment of Wages to men mazdoors does not arise "

రిట్రెంచ్ అయినవారికి గ్రాట్యుయిటీ ఇచ్చే విషయంలో ఇలా ఉంది

"The Government Orders for payment of retrenchment gratuity have already been communicated to all the Superintending Engineers and Executive Engineers The payment is made after the formalities are gone through. In Telangana the retrenched workers are paid half month's salary as retrenchment gratuity for every completed year's of service with effect from 1-4-55 Necessary instructions have been issued to the Chief Engineer (Highways) for payment of the gratuity as per rules to those mazdoors who are eligible The Chief Engineer has issued instructions to the Superintending Engineers and District Engineers It has been stated that these orders have not been received in the Divisional Offices Instructions are being issued again to the Chief Engineer that he should ensure the implementation of the orders of the Government "

గౌ సభ్యులు ఇంకొక విషయం చెప్పారు సమయానికి వీళ్ళకు వేజెస్, జీతాలు దొరకటం లేదని చెప్పారు. వాళ్ళకు వేజెస్‌గాని, జీతాలుగాని, 15 వ తారీఖు లోపల ఇవ్వాలని ఒక రూలు ఉన్నది ఆ రూలు ప్రకారం ప్రస్తుతం ఈయడం జరుగుతున్నదని మనవి చేస్తున్నాను

"That the wages are paid by the 5th of every month and instructions be issued to Chief Engineer, Highways that the payment should be made by the 5th of every month." అని ఒక ఇన్‌స్ట్రక్షన్ ఇచ్చినాము.

తరువాత, ట్రాన్స్‌ఫర్స్ విషయంచెప్పారు నిజానికి విచారిస్తే, "ఇక్కడ వాళ్ళను ఇక్కడే ఉంచుతాము, ఇంకోచోటికి పంపించము" అనేటటువంటి ఎగ్రిమెంటు ఎక్కడా లేదు "ఎక్కడివాళ్ళను అక్కడే ఉంచాలి, ఆ ఏరియా లోనే వాళ్ళను ట్రాన్స్‌ఫర్ చేయాలి, ఇంకెక్కడికో, దూరప్రాంతానికి పంపించే అధికారం గవర్నమెంటుకు లేదు" అనే విషయాన్ని ఎంతమాత్రం గవర్నమెంటు అంగీకరించదు అయినప్పటికీ, దానిని గురించి గవర్నమెంట్ ఇన్‌స్ట్రిక్షన్స్ ఇచ్చారు

"To avoid transfers to long distances as far as practicable" అని ఇన్‌స్ట్రిక్షన్స్ ఇచ్చారు

చౌకిదారు, స్వీపర్సు విషయం చెప్పినారు, ఆ విషయాలు ఇంతవరకు నా దృష్టికి రాలేదని మనవి చేస్తున్నాను ఆ విషయాలు గవర్నమెంటు దగ్గరకు కూడ రాలేదు. వారియొక్క గ్రీవెన్సెస్ ప్రభుత్వానికి తెలిపితే, అందుగురించి చర్యలు తీసుకొంటామని మనవి చేస్తున్నాను ఈ విషయాలు తీసుకువచ్చి ఏదైతే ఎడ్‌జర్న్‌మెంట్ మోషన్ పెట్టినారో, అది అనవసరమైనదని చెబుతు న్నాను ఇప్పుడు నేను తెల్పిన ప్రకారం కొన్ని ఇన్‌స్ట్రిక్షన్స్ ఇచ్చినాము అవి అమలు జరుగుతున్నాయని మనవి చేస్తున్నాను

మిస్టర్ స్పీకర్ వాళ్ళ కష్టాలు గురించి విచారణ చేస్తున్నట్టు, వీలున్నంతవరకు వాళ్ళ ఇబ్బందులను తొలగించటానికి ప్రయత్నిస్తున్నట్లు, గౌ మంత్రిగారు చేసిన ప్రకటనవల్ల తెలుస్తున్నది కాన్‌స్టిట్యూషనల్ మెథడ్‌గా గవర్నమెంటుకు చెప్పుకోవాలి. స్ట్రయిక్ నోటీసు ఇచ్చామంటే "This House cannot sympathise It is an unconstitutional method" స్ట్రయిక్ నోటీసు ఇస్తామంటే, అది వేరేసంగతి స్ట్రయిక్ అన్నది అన్ కాన్‌స్టిట్యూషనల్ మెథడ్ I disallow the Adjournment Motion

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు · అధ్యక్షా, నేను పాయింట్ ఆఫ్ ఆర్డర్ రైజ్ చేస్తున్నాను. మీరు రూలింగ్ ఇస్తూ, స్ట్రయిక్ కాన్‌స్టిట్యూషనల్ మెథడ్ కాదు అన్నారు స్ట్రయిక్ చేయటం, outside the purview of the Constitution అని మీరు రూలింగ్ ఇచ్చారు. కాని కాన్‌స్టిట్యూషన్‌లో స్ట్రయిక్ చేసే హక్కు ఉన్నది. కాబట్టి స్ట్రయిక్ చేయటము కాన్‌స్టిట్యూషనల్ మెథడే. పోతే, స్ట్రయిక్ చేయటం అన్నది, వర్కర్సు, యూనియన్స్, ఎంప్లా

యర్స్‌కు సంబంధించిన విషయము కాని, మీరు స్ట్రయిక్ అన్‌కాన్‌స్టిట్యూషనల్ అని రూలింగ్ ఇచ్చారు అది సరిఅయినది కాదేమోనని మీ దృష్టికి తీసుకొస్తున్నాను

*Mr Speaker* I shall consider the question There is some force in what the hon Member has said The labour has a right to strike, in this world అంతేకాని ప్రతి విషయములో కూడ గ్రామ కరణములు, ఉద్యోగస్థులు, వీరు, వారు, ఎవరుపడితేవారు strike చేయడమనేది వేరేవిషయము అయినప్పటికినీ, మినిష్టరుగారు చెప్పిన విషయాలదృష్ట్యా దీనికి adjournment motion అవసరములేదని చెబుతున్నాను

## ADJOURNMENT MOTION RE UNREST AMONGST STUDENTS ON THE QUESTION OF APPOINTMENT OF THE VICE-CHANCELLOR OF OSMANIA UNIVERSITY

*Mr Speaker* The following is the Adjournment Motion given notice of by both Sri P Sundarayya and Sri P Narasinga Rao —

"We hereby give notice under Rule No 74 calling attention of the Education Minister, on a matter of urgent public importance viz the unrest that is being manifested among students on the question of the appointment of Sri D S Reddy, as Vice-Chancellor of the Osmania University"

ఈ adjournment motion విషయములో నా అభిప్రాయమేమిటంటే ఒక constituted authority ని గాని, లేకపోతే Vice-Chancellor of the University గా ఎవరినో ఒక పెద్దమనిషిని ప్రభుత్వమువారు వేశారు ఆయనను వేయడములో, Osmania University కి సంబంధించిన రెండు వేలమంది విద్యార్థులు "ఈ Vice-Chancellor పనికిరాడు, అందువల్ల మేము కాలేజి మానివేస్తాము," అని strike చేస్తూ అల్లరి సాగించారు ఈలాంటి విషయాలలో నాకు తెలిసినంతమటుకు, నేనొకప్పుడు చూచాను There is a great students' movement in Egypt by name Alzar movement ఆ యూనివర్సిటీ చాలా పెద్దది. అట్లాగే China లో ఉన్నది- ఇప్పుడు students strike చేస్తే ఏమిఅవుతుందో మీకందరికీ తెలుసు అది వేరేసంగతి. పూర్వము Sunyet Sen, Chiang-ke-Shaik రోజులలో వారు బ్రహ్మాండమైన పాత్రధరించారు They were very

2

revolutionary and radical దేశములోని ప్రభుత్వాన్ని గురించి యిలాంటి విషయములో part పుచ్చుకున్నారే గాని, "మాకు యీ మాష్టరుఅక్కరలేదు, తీసి వేస్తారా, లేదా ? లేకపోతే ఈ Vice-Chancellor ను తీసి వేయండి" అని ఈ మాదిరిగ జరిగితే, ఏదో ఇది Educational Institution గనుక ఎవరైనా మాష్టరు కొత్తగా రాగానే, strike చేయటానికి ప్రారంభిస్తారు కాబట్టి దీనికి అంతటికి యీ House notice తీసుకోవాలి అని, దానికి ఏదో చేయాలి, అని చెప్పడము మాత్రను కూడదు Students యిప్పుడు చేసింది చాలా తప్పు They are only ill-advised and misled ఇందులో ఏమీ question లేదు. కాబట్టి మనమందరము ఆ students కు advice యివ్వాలి, కాని సభలోని ఏ పార్టీవారుకూడ వాళ్ళను encourage చేయకూడదు అందు వల్ల దీనిలో adjournment motion ప్రసక్తేమీలేదు వాళ్ళందరు ill-advised, misled ఐ ఉంటారు Nizam College, strike లో join కాలేదు కానిఎలాగో యిది జరిగింది వాళ్ళకు ఈ Vice-Chancellor ను వేయడము చాలా అసం తృప్తిగా ఉన్నది గనుక సుందరయ్యగారు తెచ్చిన motion చాలా reasonable గానే ఉన్నది, ఈ విషయములో సుందరయ్యగారు ఏదో నాలుగు మాటలు చెబుతారు తరువాత Educational Minister గారు ఒక statement ఇస్తారు ఈ Adjournment motion నేను త్రోసివేశాను 74 వ రూలు క్రింద సుందరయ్య గారు వారికి తోచింది అడుగుతారు మంత్రిగారు సమాధానము చెబుతారు

*శ్రీ పి. సుందరయ్య (గన్నవరం) అధ్యక్షా, ఉస్మానియా విశ్వవిద్యా లయమునకు Vice-Chancellor గా D S Reddi గారిని ప్రభుత్వమువారు నియమించినందున ఆ విశ్వవిద్యాలయములో చదువుకునే విద్యార్థులు మొన్నటి దినమునుంచి సమ్మె చేయడము జరిగింది. వాళ్ళు సమ్మె చేశారుగనుక యీ Adjournment motionను తీసుకునివచ్చి, ఆ విషయము యిక్కడ చర్చించాలని గాని. మరొకటికాని మా ఉద్దేశంకాదు విద్యార్థులకు విద్యావిధానములో యింక ఏలాంటిమార్పు తీసుకుని రావటానికి ప్రయత్నించినను, దానినిగురించి కూడ వెనువెంటనే యిక్కడ విచారించాలని కూడ మా ఉద్దేశ్యముకాదు విద్యార్థులు భావిపౌరులు గనుక వారిలో కొన్ని అపోహలు కలుగవచ్చు కాని ఆ అపోహలు తీర్చటానికి దానివల్ల వారియొక్క విద్యావిధానమునకో, లేక మరేవిధంగానో నష్టము వస్తుందనిగాని, అనుకోవచ్చు వారు వ్రాసిన కర పత్రంలో తెలంగాణాప్రజలయొక్క హక్కులకుభంగకరంగ చేశారుగనుక, వారికి యిది అసంతృప్తిని కలుగజేస్తున్నదని వ్రాశారు. అలాంటి పరిస్థితులలో యీ

శాసనసభ వేదికమీద మంత్రులు ఇచ్చిన statement గూడ పత్రికలలో వచ్చింది అంతేకాకుండ ముఖ్యమంత్రిగారు అసలు యీ appointment నకు సంబంధించిన విషయాలు అన్నీ వివరముగచెప్పి, యీలాంటి అపోహలు తెలంగాణ వారికి ఉండటానికి ఆస్కారములేదని ప్రకటించినట్లయితే, అప్పుడు విద్యార్థులు ఏ కారణములవల్ల సమ్మె చేస్తున్నారో, అది సరియైన కారణముఅవును, కాదు అని చెప్పటానికి వీలుఅవుతుంది ఆ విధముగ యీ సమస్యను పరిష్కరించుకోటానికి, వారికి ఉన్న అపోహలు, అనుమానాలు, అందులో ముఖ్యంగా ఆంధ్ర అని తెలంగాణ అని ఒక చీలికను రెచ్చగొట్టుతూ ఉంటే, దానికి ఏ మాత్రము కూడ ఆస్కారము లేకుండా చేయటానికి వీలుగా ఉంటుందనే ఉద్దేశ్యము అసలు వాస్తవముగ ఏమిజరిగింది? ఇప్పుడు యీలాంటి పరిస్థితిరావటానికి కారణము ఏమిటి? అనే విషయాలు విచారించాలి ఇదిగాక వారు యింకొక point raise చేశారు ఏమిటంటే, తిరుపతి విశ్వవిద్యాలయానికి, ఆంధ్ర విశ్వవిద్యాలయానికి Vice-Chancellor పదవికి ఎన్నికలుజరిగే సందర్భములో పత్రికలలో వచ్చిన వార్తలనుబట్టి తిరుపతి విశ్వవిద్యాలయానికి Dr D S Reddi గారుకూడ ఎన్నికకు పోటీ చేస్తున్నట్లు, Osmania University ని తెలుగు విశ్వవిద్యాలయముగ మార్చబోతున్నారు గనుక దానిలో ఆ పదవికి పోటీచేయవచ్చునని, విరమింపజేసినట్లు, పత్రికలలో వచ్చింది ఇది ఒక అపోహకు కారణము అయింది దాని కనుగుణ్యముగ ప్రస్తుతము Osmania University యొక్క Vice-Chancellor పదవీకాలము ఇంకను నాలుగు నెలలు ఉండగానే, యిప్పుడు యింత తొందరలో యీ appointment చేయవలసిన అగత్యము ఏమి వచ్చింది అనేదికూడా అపోహకు కారణము అవుతున్నది అందువల్ల ఈ విషయము లన్నింటినీ గురించి వివరముగ ముఖ్యమంత్రిగారు చెబితే యీ అపోహలు తెలంగాణవారితో యింకను ప్రబలమై అశాంతిని రెచ్చగొట్టటానికి ఎవ్వరికినీ అవకాశము లేకుండా పోతుంది అందువల్ల ఉన్న వాస్తవిక పరిస్థితులు అన్నీ స్పష్టముగ తెలియడానికి, తెలంగాణ ప్రజలు తెలుసుకోటానికి వీలుగ ముఖ్యమంత్రిగారు యీ సభావేదికమీద చెబితే మంచిదని, ఈ విషయాలు అన్నీ ప్రభుత్వ దృష్టికి తీసుకుని వస్తూ Adjournment motion ను ఇచ్చాను.

శ్రీ పి నరసింగరావు (హుజూరాబాద్ - జనరల్) అధ్యక్షా, Osmania University కి క్రొత్తగా Vice-Chancellor ను నియమించే సందర్భములో తెలంగాణ అని, ఆంధ్రఅని, భేదము ఏమీలేదు కాని, యీ Osmania

University కి Vice - Chancellorship విషయములో మొదటినుంచి కొన్ని సాంప్రదాయములు ఉంటూన్నవి ఈ విశ్వవిద్యాలయము యొక్క Vice - Chancellor పదవీ విరమణ సమయములో వారు మరొకరిని propose చేయడము, దానిని ప్రభుత్వము అంగీకరించడము, కాక Sympathetic గా Consider చేయడము, యీ విధముగ జరుగుతూ వస్తున్నది ఆ సాంప్రదాయానికి విరుద్ధముగ యిప్పుడు యీ appointment ప్రభుత్వము చేయడము జరిగింది అంతేకాకుండా Academic year యింకా పూర్తి కాకముందే, యీ మధ్యకాలములోనే యిప్పుడు ఉన్న Vice-Chancellor ను తీసివేసి, క్రొత్తవారిని నియమించడము కూడ సాంప్రదాయానికి విరుద్ధము అని చెప్పక తప్పదు ప్రస్తుతము యీ Academic year పూర్తి అయ్యేవరకు, యీ నాలుగు అయిదు మాసములు పూర్తి అయ్యేదాక వీరినే ఉంచి, తరువాత యీ నాలుగు అయిదు మాసములు పూర్తికావచ్చేటప్పుడు ఎన్నిక ఏర్పాటుచేసి, తద్వారా Vice - Chancellor ను ఏర్పాటు చేయాలని ప్రభుత్వానికి ఉద్దేశ్యము ఉన్నట్లుగా కూడ ప్రకటించడము జరిగింది ఇదిపరకు జరిగినట్లుగానే, యీ నాలుగు అయిదు మాసములు University వ్యవహారములు జరిగించినట్లయితే, యిక్కడ ప్రజలకు, విద్యార్థులకు అంతగా ఆక్షేపణ వచ్చియుండేదికాదు ఈ నాలుగు అయిదు మాసములు జరిగిన తరువాత, యీ appointment ను శాసనసభ ద్వారా ప్యాసు చేయించి, సభ యొక్క ఆమోదము పొంది Sri D S Reddi గారినైనా సరే elect చేయించి appoint చేసినట్లయితే, యిలాంటి అనుమానాలకు, అపోహలకు అవకాశము ఉండేది కాదు. ప్రభుత్వము ఆవిధముగ చేయకుండా, ఎవరినో ఒకరిని సంతృప్తి పరచటానికి, ముందుగానే యీ విధముగా చేశారని విద్యార్థులకు అసంతృప్తి కలిగింది. ఇదిగాక Dr D. S Reddi గారు ఆంధ్రయూనివర్సిటీ, తిరుపతి యూనివర్సిటీల యొక్క Vice-Chancellorship కు పోటీ చేయకుండా, Osmania University Vice-Chancellorship ఆయనకు ఏర్పాటు చేయటానికే ఆయనను అక్కడ పోటీ చేయకుండా ఆయనను అభ్యర్థిత్వమునుంచి ఎవరో కొందరిద్వారా విరమింపచేసి, యిప్పుడు యింత తొందరలోనే ఆ ఒప్పందము ప్రకారము యిక్కడ appointment యివ్వడము జరగింది, ఈ విధముగా చేయడమువల్ల విద్యార్థులలో అసంతృప్తి, అనుమానములు ఏర్పడినవి ఈ విధముగ ప్రభుత్వము చేయడము ఏ మాత్రము సమంజసముగ లేదు. కాబట్టి యిప్పటికైనా ప్రభుత్వమువారు ఎటులయినా ఎన్నికలు జరుపుతారు గనుక,

వీలు అయినంత త్వరలో University Bill ను తీసుకునివచ్చి, యిక్కడ ప్యాసు చేయించినతరువాత యీ appointment పూర్తి చేయాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను

*Mr speaker* Whatever it is the students should not take this matter into their hands We must condemn this action of the students and discourage them అదిమాత్రమునిశ్చయము Sri D S Reddi గారిని appoint చేయటానికి ప్రభుత్వానికి అనేక కారణము లుండవచ్చు అలాంటి సందర్భాలన్నీ పెద్దపెద్ద వాళ్ళకు ఉండవచ్చునుగాని, studeuts కు అవసరములేదు "మీరు వీరిని తీసికోనకపోతే, మేము కాలేజీకి పోవడము మానివేస్తాము" అంటే, ఇది ఎట్లా ఉన్నదంటే, ఇక్కడ House లో "మమ్ములను మీరు మాట్లాడనివ్వకపోతే మేము యీ సభలోనుంచి లేచి పోతాము" అని అన్నట్లుగా ఉన్నది (Laughter)

Now I call upon the hon. Education Minister to make a statement

* శ్రీ కె విజయభాస్కరరెడ్డి (ఎమ్మిగనూరు-జనరల్) On a point of Order, Sir 74 వ రూలు క్రింద Debate గాని, సభ్యులు మాట్లాడడము గాని కూడదు అని చెప్పి, మరల యిప్పుడు ఆ విధముగ allow చేశారు ఇది ఒక convention అయిపోతున్నది దీనిపైన మీరు strict గా ఒక రూలింగు యిస్తే బాగా ఉంటుంది కాకపోతే ఎప్పటికీ గూడ యిదే ఆచారము అయి పోతుందనుకుంటున్నాను

మిస్టర్ స్పీకర్ ఇకముందు 74 వ రూలు క్రింద debate గాని, సభ్యులు మాట్లాడముగాని allow చేసేటప్పుడు, మొదటివారిని మాత్రము మూడు నిమిషములు మాట్లాడనిస్తాను దానిమీద Debate ఏమీ ఉండదు ఎందువల్లనంటే, యీ రూలును చదివి చూస్తే ఎవ్వరినీ మాట్లాడనివ్వ కూడదని స్పష్టముగ లేదు Debate allow చేయకూడదు అని ఉన్నది ఇక మీదట నేను యీ convention ను adopt చేయబోతాను In all these cases, the person who gives notice will speak for three minutes and then the Hon. Minister will make a statement on that There will be no debate or explanation on the subject. That is the Ruling.

*Sri B Sriramamurty (Vizianagaram)* On a point of Order, Sir

నేను ఒక adjournment motion యిచ్చాను అది ఏమయిందో చెబుతారా?

మిస్టర్ స్పీకర్ అది త్రోసివేశాను

శ్రీ బి. శ్రీరామమూర్తి అలాగైతే, ఈ adjournment motion తరువాత "calling attention of the Hon Minister" అనేది యీ రెండున్నూ ఒకే సమస్యకు, ఒకే విషయానికి సంబంధించినప్పుడు, ఇందులో ఏది కావాలి అనే విషయము మీద అధ్యక్షులవారు ఏరకమైన దృక్పథము తీసుకున్నారో తెలుపగోరుతున్నాను

మిస్టర్ స్పీకర్ దీనికి Adjournment ఏమీలేదు students అట్లాచేయడము బాగాలేదు, అది తప్పు, అని గట్టిగా అభిప్రాయమిచ్చాను ఇదే సభవారి యొక్క ఉద్దేశ్యముకూడ కనుక adjournment motion ఏమీలేదు అయితే 74 వ రూలు క్రింద Leader of the Opposition, Deputy Leader of the Socialist Party, వీరు యిద్దరూ Adjournment motion యిచ్చారు దాన్ని గురించి వారికి తోచింది చెప్పారు ఇప్పుడు మంత్రిగారు statement యిస్తారు అంతేగాని, దానిమీద discussion గాని expression of opinion గాని ఏమీ లేదు.

*Mr Speaker* Now, the hon Minister for Education is going to make a Statement and no more discussion or expression of opinions will be allowed

*The Minister for Education (Sri S B P Pattabhi Rama Rao)* - Mr Speaker, Sir Before I make the statement which I have prepared already, I have to meet two points mentioned by the hon. Leader of the Opposition and the Deputy Leader of the Socialist Party.

శ్రీ గోపిడి గంగారెడ్డి (ముథోల్): అధ్యక్షా, మంత్రిగారు తెలుగులో చెబితే బాగుంటుంది.

*Sri S. B. P. Pattabhi Rama Rao* - Let me go the way I have chosen please, because I have got the freedom to do it.

*Mr Speaker* English is the Official Language still and the hon Minister has the freedom to speak in English

*Sri S B P Pattabhi Rama Rao* The first point is that I cannot answer all that the hon Members are presuming That is, there was some election to the Vice-Chancellor's post of Sri Venkateswara University and somebody had contested the election and he has been persuaded to withdraw from the contest with the hope that he would be selected for the post of the Vice-Chancellor in the Osmania University and so on That is all incorrect, Sir, and I stoutly refute it They are entitled to contest the election or withdraw from the contest They do it in their own way and Government has nothing to do with that

The second point is that the hon Members are presuming certain things about the proposed Act or Bill regarding the Osmania University Their presumption is quite incorrect How can they say that there is going to be a clause in the Bill that the Vice-Chancellor will be elected or selected ? It is for this Hous to pass the Bill if and when it comes I have never said, either in public or in private, that the Vice-Chancellor of the Osmania University will be an elected person That is not correct

After having answerd these two charges, I go to read the Statement which I have prepared In this connection just allow me to explain the exact position under which the present Vice-Chancellor has been appointed, Sir

Sri Dinnepati Sadasiva Reddi (D S Reddi) is an Honours Graduate in History and Politics of the Madras and Oxford Universities and Casberd Scholar of St John's College, Oxford He also holds the Diploma in Anthropology of the Oxford University He entered service in February 1924 in the Education Department of th Government of Madras in the Madras Education Service Cadre. He has served in the Government in various capacities in the Education Department both on the teaching as well as administrative side before he was appointed as Director of Public Instruction, in the composite Madras State in the year 1947 In April 1952 when the Government was headed by Sri Chakravarthula Rajagopalachari he was re-employed as Director of Public Instruction after retirement In June 1952 he retired after accepting appointment as the Head of the Technical Assistance Mission of the UNESCO in Liberia. He served in Liberia till May 1954.

On a request from the Andhra Government—I repeat this, Sir—On a request from the Andhra Government when Sri T Prakasam was the Chief Minister, Sri Reddi, as a patriotic gesture resigned his appointment in Liberia and accepted the post of Director of Public Instruction, Andhra I may mention here that the President of the Republic of Liberia, who approached even the Government of India for his continuance, conferred on him at the time of his departure the highest honour in his hands and made him Grand Commander of the Order of Star of Africa He served the State of Andhra and subsequently Andhra Pradesh as Director of Public Instruction from June 1954 till he retired from service on 9th July 1957 In his capacity as Director of Public Instruction, he served on the Syndicate of various Universities such as Madras, Andhra-Annamalai, Sri Venkateswara, Osmania, etc , and mastered the prob, lems connected with University Education When Sri S Govindarajulu, Vice-Chancellor of Sri Venkateswara University went abroad recently, Sri D S Reddi officiated as Vice-Chancellor for some time

It may also be stated in this connection that when Sri Reddi was the Director of Public Instruction, Andhra State, he was approached for the Vice--Chancellorship of the Kashmir University which he did not accept Recently the Government of Kerala offered him the post of Director of Public Instruction on about Rs 2000/- per mensem with free quarters and even tempted to make him Vice - Chancellor of the Travancore University in succession to the present holder This offer also, Sri Reddi did not accept

According to the provisions of the Revised Charter of the Osmania University, appointment to the post of Vice-Chancellor of the University should be made by the Governor in consultation with the Council of Ministers The post is a selection post and no where has it been laid down that the claims of the employees of the University should be considered for appointment to this post ; nor has it been mentioned that the appointment should not be made in the middle of academic year. It is open to the Government to select the person whom they consider eminent in the field of Education for appointment as Vice-Chancellor Even so, Sir, the hon Chief Minister in his capacity as Chancellor did consult the members of the University Council as well as a good number of members of this Assembly elected from the Telangana area. It was agreed on all hands that Sri Reddi was the most appropriate choice. Although the question of amending the existing Charter is under consideration, the present provisions require that the Vice-Chancellor be appointed

on the recommendation of the Cabinet and there has been no violation of the existing provisions of the Charter Actually, Sir, the choice of Sri D S Reddi to the office has been unanimous by the Council of Ministers The question of the applicability of "safeguards" to the University does not arise as the University is an autonomous body governed by its own Charter In making appointment to the post of Vice-Chancellor one has to consider the larger interests of the Institution, and in view of Sri Reddi's distinguished academic as well as administrative career, the Government are convinced that he is the best educationalist available in the field today, to hold the post of Vice-Chancellor Hence, after careful consideration of all aspects, Sri D S Reddi has been appointed as Vice-Chancellor to the Osmania University

## ADJOURNMENT MOTION RE FLOODS IN NELLORE DISTRICT

శ్రీ జి యలమందారెడ్డి అధ్యక్షా, నెల్లూరు వరదలగురించి నేను యిచ్చిన adjournment motion వుందండి

మిస్టర్ స్పీకర్ నెల్లూరు వరదలను గురించి తగినచర్య తీసుకోబడు తున్నది కనుక వేరే adjournment motion అవసరంలేదు. సాధారణంగా adjournment motion అంటే ప్రభుత్వం తప్పు చేశారనే implication వుంటుంది A sort of expression of displeasure కాని అది vote of censure కాదు దానివల్ల ప్రభుత్వం పడిపోదు ప్రభుత్వం దేనినయినా neglect చేస్తున్నారంటే దానినిగురించి adjournment motion వస్తుంది నెల్లూరు వరదల విషయంలో బాధ్యత గలవారు తగినచర్య తీసుకుంటున్నారు Before we go we request Hon the Chief Minister and Dr Gopala Reddi, and the Agricultural Minister to make a statement on the situation దానికి adjournment motion అక్కరలేదని యిదివరకే అనుకున్నాము. అందుచేత allow చేయలేదు

## THE MADRAS DISTRICT BOARDS (ANDHRA PRADESH AMENDMENT) BILL, 1957

*The Minister for Local Administration (Sri K Brahmananda Reddi)* I beg to move

"That the Madras District Boards (Andhra Pradesh Amendment) Bill, 1957 be taken into consideration"

*Mr Speaker* Motion moved,

*శ్రీ కె బ్రహ్మానందరెడ్డి ఈ బిల్లు చాలా చిన్నబిల్లు ఒక Section కే చిన్న పాటి సవరణను మనం చేస్తున్నాం ఇదివరలో చాలసార్లు ఆంధ్రరాష్ట్ర శాసనసభలో దీనిపై చర్చించారు ఈ బిల్లులో వున్న విషయం యేమిటంటే జిల్లాబోర్డులలో యిప్పుడున్న Special Officers పదవీ కాలం 10 డిసెంబరు 1957 తో అంతమవుతుంది ఆ కాలాన్ని 10 డిసెంబరు 1958 వరకూ పొడిగించవలసినది అనేది మాత్రమే దీనిలో వుంది నేను యిప్పుడు యీ బిల్లు అవసరాలను గురించి ప్రత్యేకంగా చెప్పనవసరంలేదను కుంటాను ఎందుకంటే గౌరవ సభ్యులకు తెలిసిన విషయమే కాకుండా statement of objects and reasons చిత్తగించితే దానికిగల ముఖ్యకారణాలు దానిలోనే చెప్పబడి వున్నాయి

అదీకాకుండా ఈ కాలములో ఈ లోకల్ ఎడ్మినిస్ట్రేషన్‌ను ఎలా 'రిఆర్గనైజ్' చేయాలి? ఏ పద్ధతి ప్రకారం ఈ జిల్లా బోర్డులస్థానే బ్లాక్ లెవల్లో కమిటీలు కాని కౌన్సిళ్ళుగాని ఏర్పాటు చేయాలి? ఈ జిల్లా బోర్డుల కార్యక్రమములో ఈ బ్లాక్ కౌన్సిల్స్‌కు సక్రమంగా నిర్వహించేశక్తి వుంటుందా? అనే విషయములు తెలుసుకోటానికి గౌరవ సభ్యులందరికి 'white paper on the reorganization of local administration' ఇవ్వబడింది గౌరవ సభ్యులందరు దానిని చదివేవుంటారని నేను అనుకొంటున్నాను

మనకు జిల్లా బోర్డులనేవి అనేక సంవత్సరములనుండీ వున్నాయి అవి కొన్ని కార్యక్రమములు నిర్వహించాయి ముఖ్యముగా కొన్ని రోడ్లు వేయటము, ఎలిమెంటరీ స్కూల్స్ సెకండరి స్కూల్స్ పెట్టటము హాస్పిటల్స్ పెట్టటము మొదలైన కార్యక్రమములను ఇదివరకు చక్కగానే నిర్వహించాయి, కాని ఇక ముందురోజులలో ప్రజలకు నచ్చేవిధంగా ప్రజలు మెచ్చేవిధంగా బ్లాక్ లెవెల్లోచేస్తే బాగుంటుందనే ఆలోచనలో ఇది జరిగింది

శ్రీనగర్‌లో లోకల్ బాడీస్ మినిస్టర్స్ కాన్ఫరెన్సు జరిగినపుడు, యింకా అనేకచోట్లకూడా ఈdecentralization పద్ధతిని అన్ని రాష్ట్ర ప్రభుత్వములు క్లుప్తముగా అంగీకరించినవి.కనుక ఈకార్యక్రమమును ప్రారంభించుటకు కొన్నిసవరణలు అవసరమైనవి ఈసవరణను వచ్చేలోపుగా 10 డిసెంబరుతో కాలం పూర్తవుతుందికనుక ఈ సవరణనుతెచ్చేవరకు ఈ కాలమును పొడిగించవలసిన అవసరం వున్నదని సభ్యులందరు గుర్తించగల రనుకొంటున్నాను. అందుచేత ఈ చిన్న amending Bill ను ఆమోదించవలసిందిగా నేను సభ్యులను కోరుచున్నాను. గౌరవ సభ్యులు చర్చలో పాల్గొని, కొన్ని సూచనలు చేస్తే, ఈ White Paper

గురించి కాని, యింకా ఇతర కార్యక్రమముల గురించి కాని జవాబుచెప్పవలసిన అవసరం వుంటే తప్పకుండా మనవి చేస్తాను.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య (సత్తెనపల్లి) అధ్యక్షా! amendments వున్నాయండి

మిస్టర్ స్పీకర్ తరువాత చూద్దాము

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య అధ్యక్షా! amendments వుంటే మొట్టమొదట వాటిని తీసుకొని, వాటితోపాటు discussion చేయటం సాంప్రదాయము ఇప్పుడది ఎందుచేత మార్చవలసివచ్చింది ?

మిస్టర్ స్పీకర్ ఏ rule క్రింద, అలా వున్నదో చెబితే తప్పకుండా obey చేస్తాను ఆ సాంప్రదాయం ఎక్కడ వుంది ?

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య అధ్యక్షా! Amendments లేకుండా discussion చేయటం సాంప్రదాయమేనని మీరు ruling ఇస్తే accept చేయటానికి సిద్ధంగా వున్నాము

శ్రీ పి సుందరయ్య అధ్యక్షా, Select Committee కి పంపించాలన్నప్పుడు, ఏదైనా సర్క్యులేషన్ మోషన్ వున్నప్పుడు దానికి priority ఇవ్వటం జరుగుతుంది కాని general discussion కు ముందు రావు

మిస్టర్ స్పీకర్ I agree అవి general discussion కు ముందు రావు

*శ్రీ సి హెచ్ రాజేశ్వరరావు (చొప్పదండి) అధ్యక్షా, ఈ జిల్లా బోర్డుల బిల్లుకు ఒక amendment ను ప్రతిపాదిస్తూ గౌరవనీయులైన లోకల్ ఎడ్మినిస్ట్రేషన్ మంత్రిగారుచెప్పిన విషయములు విన్నతరువాత, నిన్న సభ్యులకు అందచేసిన White Paper ను చదివిన తరువాత, ఈ బిల్లు చిన్నదిగా, ఈ సవరణ చిన్నదిగా కన్పించినప్పటికి, చాలా ముఖ్యమైనదని, జాగ్రత్తగా చర్చించవలసియున్నదని నేను భావిస్తున్నాను జిల్లాబోర్డుల యంత్రాంగమును, స్టేటు లెవెల్ నుంచి క్రిందివరకు జరుగుతున్న కార్యకలాపాలను సమీక్షించి ప్రభుత్వ యంత్రాంగమును జిల్లా స్థాయిలో, తాలూకా స్థాయిలోనికి ఏ విధంగా సవరించి సంస్కరించాలనే విషయమును ప్రభుత్వం ఆలోచిస్తున్నట్లు వైట్ పేపరులో తెలిపారు బల్వంతరాయ్ మెహతా కమిటి చేసిన సిఫార్సులను అన్ని

ప్రభుత్వములు విచారిస్తున్నట్లు, ఆ ప్రభుత్వములతోపాటు ఆంధ్ర ప్రభుత్వము కూడా ఆ కమిటీ సిఫార్సులను పరిశీలించి ముఖ్యమైన కొన్ని నిర్ణయాలు చేసినట్లు ఈ వైట్ పేపరువల్ల స్పష్టమవుతున్నది బల్వంతరాయ్ మెహతా కమిటి రిపోర్టు వల్లకాని, లేదా పాత అనుభవాన్ని దృష్టిలో వుంచుకొని కాని, ఈ జిల్లా బోర్డుల యంత్రాంగము ఈ జిల్లాబోర్డులు, పంచాయితీబోర్డులు అన్నీ పాత వ్యవస్థగా వున్నాయి కాబట్టి వాటిని సవరించాలని ప్రభుత్వం అభిప్రాయపడు తోంది ఆ అభిప్రాయముతో నేను పూర్తిగా ఏకీభవిస్తూ మార్పు తీసుకు రావాలని చెబుతున్నాను

బ్లాకు డెవలప్‌మెంటు కార్యక్రమములలో గ్రామమును base గా తీసుకొని, గ్రామపంచాయితీలకు ఎక్కువ అధికారాలనిచ్చి, గ్రామపంచాయితీ నిర్మాణ కార్యక్రమములో ఎక్కువ చొరవ తీసికొని, ప్రజల యొక్క సృజనా త్మకశక్తిని, direct cooperation ను పెంపొందించి పటిష్ఠమైన యంత్రాంగాన్ని నిర్మించాలని ప్రభుత్వం భావిస్తుంటే దానికి సభ్యులందరు అంగీకరిస్తారు అయితే ఈనాడు వున్న పరిస్థితులను మార్చవలసివుంది ఈ మార్పు ఏ పద్ధతిలో ప్రవేశ పెట్టాలి? ఏ విధంగా అంతంచేయాలనేవిషయమును మనం తుణ్ణంగా చర్చించక తప్పదు రేపు జిల్లాబోర్డుల లెవెల్‌లో జిల్లా కౌన్సిల్స్ వుంటాయి. బ్లాక్ లెవెల్‌లో బ్లాక్ కౌన్సిల్స్ వుంటాయి పంచాయితీ బోర్డులకు డైరెక్టుగా ఎన్నికలు జరుగుతాయి ప్రజలతో సన్నిహిత సంబంధము పెట్టుకోటానికి, అభి వృద్ధి కార్యక్రమాలు చేయటానికి ఈ బ్లాక్ కౌన్సిల్స్ కృషిచేసినా వాటిలో పంచాయితి బోర్డు ప్రెసిడెంటు, మరొక కొంతమంది నామినేటెడ్ మెంబర్స్ వుంటారు. జిల్లా స్థాయిలో వుండే కౌన్సిల్‌లో జిల్లా M L A లు పార్లమెంటు సభ్యులు, అవసరమైతే కొందరు ఇతర సభ్యులు వుంటారు. పాతవ్యవస్థను నిర్మూ లించి క్రొత్త వ్యవస్థను సృష్టించాలని ప్రభుత్వం అనుకొంటే ప్రజాస్వామ్యానికి ముఖ్యలక్షణమైన డైరెక్టు ఎన్నికలే బ్లాకులలోను, జిల్లా స్థాయిలోను జరపాలి. గ్రామ వ్యవహారాలను దృష్టిలో పెట్టుకొని గ్రామానికి సంబంధించి నంతవరకు ఆ గ్రామాభివృద్ధి చూడటానికి అధ్యక్షులుగా ఎన్నికైనారుగాని వారు బ్లాకు వ్యవహారములు మార్చటానికి ఎన్నికకాలేదు వారిని co-opt చేస్తు న్నప్పటికి బ్లాక్ కౌన్సిల్స్‌కు, జిల్లా కౌన్సిల్స్‌కు ప్రత్యేక బాధ్యతలను నిర్ణ యించాలి. కేవలం నామమాత్రముగా గాక వీటికి ఎక్కువ అధికారాలు ఇవ్వాలి. ఏ అధికారాలు ఇవ్వాలో, ఏవి తగ్గించాలో ఆ విషయం వచ్చినపుడు నిర్ణయించుకోవచ్చు జిల్లా కౌన్సిల్‌కు direct elections లేవు Indirect గా elect అయినవారికే బాధ్యత ఒప్పగించడంవల్ల ప్రజాస్వామ్య సూత్రం అను

గున పడిపోతుంది Indirect గా elect అయినవారే ఆ బాధ్యతను, నిర్వహించటం జరుగుతోంది

'ప్రజాస్వామ్య పద్ధతులలో ప్రజలయొక్క సృజనాత్మకశక్తిని, విశ్వాసాన్ని direct co-operation ద్వారా పెంపొందించడమే మా వుద్దేశం' అని చెబుతూనే, దానికి ఒక రూపకల్పన ఇచ్చే direct elections ను తీసివేయడం జరుగుతున్నది ఇది ఆచరణలో తప్పకుండా నిరుపయోగ మవుతుంది అని చెప్పక తప్పదు జిల్లాబోర్డుల future set-up ను గురించి District Councils, Block Councils అనే విషయమై కూడా ప్రభుత్వంవారు కొంత చెప్పారు నేను ఒక ప్రధాన విషయాన్ని ప్రభుత్వ దృష్టికి తెస్తున్నాను ఈనాడు ఏ స్థాయిలోనైనా మనం ప్రజల సహకారాన్ని చూరగొని, దానిపైన ఆధారపడి, భవిష్యత్తులో నిర్మాణ కార్యక్రమాలను అభివృద్ధి చేయాలంటే అది ఏ స్థాయి అయినప్పటికీ ప్రజల యొక్క ప్రత్యక్ష ఎన్నికలద్వారానే ఆ కార్యక్రమాలు చేసుకోవాలి రాష్ట్ర ప్రభుత్వానికీ, గ్రామ పంచాయతీకి మధ్య ఒకటా, రెండా, మూడా ఎన్ని అంతస్తులు కావాలనేది తరువాత చర్చించుకోవచ్చు ఆ అంతస్తులను నిర్ణయించి నప్పుడు ప్రతి అంతస్తు ఏ యే executive powers ను కలిగి వుండాలి, ఒక నిర్ణీతమైనప్రాంతంలో ఏ యే అభివృద్ధి కార్యక్రమాలను, తదితర కార్యక్రమాలను అమలు చేయడానికి పూనుకోవాలి. అనే విషయాలు సరిగా నిర్ణయించాలి. అంతేకాక ఆ executive bodies ప్రజలచేత ఎన్నుకోబడి ఉండాలనేది స్పష్టం చేస్తున్నాను. ఎన్ని స్థాయిలు వుండాలి, ఎన్ని అంతస్తులుండాలి అనే విషయం బిల్లులు వచ్చినప్పుడు చర్చించుకోవచ్చు అవి ఎన్ని ఉన్నప్పటికీ ఒక్కవిషయం మాత్రం మనకు స్పష్టంగా తెలుస్తుంది ప్రస్తుతం ఉన్నటువంటి జిల్లాలు చాలా un-wieldy గా ఉన్నాయని ప్రభుత్వం చెప్పినదానినిబట్టి స్పష్టమవుతున్నది ఇదివరకుఉన్న జిల్లాబోర్డులకు నామమాత్రపు అధికారాలను యివ్వడం, తగిన funds లేకపోవడంవల్ల అవి నిరుపయోగంగా వున్నాయనే విషయం చాలా మందికి తెలుసు ఇకముందు, జిల్లాబోర్డులకు ఎక్కువ అధికారాలను యిచ్చినప్పటికీ. అవి ప్రజలతో ఎక్కువగా సన్నిహిత సంబంధం కలిగి, గ్రామీణ ప్రజల సమస్యలను అర్థంచేసుకొని సహాయపడాలనే ఉద్దేశం ఉన్నట్లయితే, యిప్పుడున్న జిల్లాలు వైశాల్యాన్ని బట్టిగాని, జనాభానుబట్టిగాని చాలా un-wieldy గా ఉన్నాయి కాబట్టి వాటిని చిన్నజిల్లాలుగా చేసుకోవడం అవసరమని భావిస్తున్నాను ఇప్పుడు ఉన్న 20 జిల్లాలు 40, 50 కావచ్చు అంకా అవసరమైతే 60,70 జిల్లాల క్రింద ఏర్పాటు చేసుకోవచ్చు. రాష్ట్ర సెక్రటేరియట్ యంత్రాంగంలో తగుహంగులు ఏర్పాటు చేసికొని యిటు

వంటి 60, 70 జిల్లాలను Control చేసుకోవడం ఏమీ పెద్ద సమస్యకాదు Districts ను చిన్నవిగాజేసి, ఎక్కువ ఎక్జిక్యూటివ్ బాధ్యతలను యిచ్చిన తరువాత District Committees, elected bodies గా వుంటే వాటి క్రింది అంతస్తును గురించి మనం చర్చించుకోవచ్చును అంతస్తును ఏ విధంగా ఏ స్థాయిలో ఏర్పాటు చేయాలి లేకపోతే క్రింద అంతస్తు అవసరమేలేదా! అనేది ఆలోచించుకోవచ్చును పంచాయతీలను పెద్దవి చేసిన తరువాత జనాభాను ప్రధానంగా తీసుకొని కొన్ని గ్రామాలను గ్రూపుగా చేసిన తరువాత క్రింది అంతస్తు అవసరముంటుందా, లేదా అనేది ఆలోచించి, అవసరమైతే ఏర్పాటు చేసుకోవచ్చును అట్లా ఏర్పాటు చేసినప్పుడు దానికి elections పెట్టాలా, లేదా మళ్ళా చర్చించుకోవచ్చు అది తరువాత స్పష్టం చేసుకోవలసిన విషయం

"ఈనాడు యీ జిల్లాబోర్డు వ్యవస్థను రద్దుచేసి చక్కబరచేందుకు, దాని స్థానంలో ఒక నూతనవ్యవస్థను పునర్నిర్మాణం చేస్తున్నాము ప్రజాస్వామ్యాన్ని, ప్రజల సహకారాన్ని నిలబెట్టడానికి పూనుకుంటున్నామనే విషయాన్ని ఒక ప్రక్కన చెబుతూ, రెండవవైపున ఎలక్షన్సు లేకుండా పూర్తిగా nominated - committees ను బ్లాక్ స్థాయిలోను జిల్లాస్థాయిలోనూ ఏర్పాటు జేస్తుంటే అవి ఆచరణలో స్థానిక స్వపరిపాలనా సిద్ధాంతానికి విరుద్ధం ప్రపంచంలో ఎక్కడ చూసినా, ఒక ప్రత్యేకమైన ప్రాంతంలో, అక్కడి ప్రజలచే ఎన్నుకోబడిన సభ్యులు, కొన్ని ప్రత్యేకమైన subjects ను తీసికొని, funds ను ఏర్పాటు చేసుకొని స్థానికాధికారాలు కలిగివుండి స్థానిక ప్రభుత్వాన్ని నిర్వహించడం అనేది స్థానిక స్వపరిపాలనయొక్క ప్రధానసూత్రం ఇది అంతర్జాతీయంగా చాలా ప్రాంతాలలో ఉన్నది అయితే కొన్నిచోట్ల nominated bodies, indirect గా ఎన్నుకోబడిన వ్యవస్థలు ఉంటే ఉండవచ్చు అలాంటివాటియొక్క అనుభవాలను ఉదాహరణగా తీసుకొని, వాటిని quote చేసి, మేము కూడా అవిధంగానే చేస్తున్నాము, యిందులో తప్పేమిఉన్నది'' అని వాదించడము, ప్రజాస్వామ్యాన్ని అభివృద్ధిచేయడానికి, సోషలిస్టు సామాజిక వ్యవస్థను స్థాపించడానికి దోహదంకాదు. పంచాయతీబోర్డు ఎన్నికలవలెనే రాష్ట్రానికి, పంచాయతీకిమధ్యన ఉండే అంతస్థుకుకూడా direct elections జరగాలి. అట్లా వచ్చినప్పుడే సరైన form లో నిర్మాణయంత్రాన్ని సృష్టించి, సామాజికాభివృద్ధి కార్యక్రమాలను జయప్రదం చేసుకోడానికి ఒక సాధనంగా, ఉపకరిస్తుందని ప్రభుత్వానికి స్పష్టం చేస్తున్నాము. బలవంతరాయ్ మెహతా కమిటీ రిపోర్టును బొంబాయి ప్రభుత్వంవారు మైసూరు ప్రభుత్వంవారు కూడా పరిశీలన చేశారు అని పేపర్లలో వచ్చిన వార్తలనుబట్టి తెలుస్తోంది

వారు వివరంగా పరిశీలించి ఒక నిర్ణయానికి వచ్చారు ఆ రాష్ట్రాలకు అవి ఏవిధంగా ఉపయోగపడతాయి—ఉపయోగపడవా అనేది యిప్పుడు మనం చర్చించడం అప్రస్తుతమే కాని పత్రికలలో వచ్చిన వార్తలనుబట్టి బొంబే గవర్నమెంటు వారు పంచాయతీలకూ, జిల్లా కౌన్సిళ్ళకు కూడా direct elections ఉండాలనే నిర్ణయానికి వచ్చినట్లు తెలుస్తోంది. మైసూరు ప్రభుత్వం వారు జిల్లాలు కాకపోయినా తాలూకాలను ప్రధానంగా తీసుకొని, తాలూకా బోర్డులకు direct elections ను adult franchise ద్వారా జరిపేటట్లు నిర్ణయించారు అంటే అంతస్థులు రెండు కాకుండా ఒకటే పెడుతున్నారనుకోండి ఏది ఎలా వున్నా- మధ్య వుండే అంతస్థుకు direct elections పెట్టుకోవాలని బొంబాయి, మైసూరు రాష్ట్ర ప్రభుత్వాలు కూడా అంగీకరించాయి సోషలిస్టు సామాజికవ్యవస్థ నిర్మిస్తామని, ప్రజల సహకారాన్ని అభివృద్ధిచేస్తామనీ, అందుకు పంచాయతీలకూ, జిల్లా కౌన్సిల్లకూ funds యిచ్చి, ఎక్కువ అధికారాలుయిచ్చి, ప్రజలకు సేవ చేసేటట్లు చూస్తామని చెబుతున్నారు ప్రజలకు ప్రభుత్వం పైన విశ్వాసం కలిగించండి, ఉన్న విశ్వాసాన్నభివృద్ధిచేయండి, మీకు యీ బాధ్యతలు ఇస్తున్నాము" అని ఒక రాజకీయ నినాదాన్ని ప్రచారం చేస్తూకూడా ప్రభుత్వం వారు యీ direct elections పద్ధతిని consideration లోకి తీసుకోకుండా పూర్తిగా వదిలేసి, బలవంతర్రాయ్ మెహతా శిఫార్సులను అదనుగా అవకాశంగా తీసికొని direct elections అనే బాధ్యత నుండి మన ప్రభుత్వం తప్పించుకొంటున్నట్లు అనుమానపడడానికి ఎక్కువ అవకాశంఉన్నదని మీ ద్వారా ప్రభుత్వానికి మనవిచేస్తున్నాను

ఆంధ్ర తెలంగాణా ప్రాంతాలలో యీ గ్రామీణవ్యవస్థలలో తేడాలుంటే ఉండవచ్చు, వెనుకబడిన ప్రాంతాలలోని పంచాయితీబోర్డు సభ్యులు అనుభవంతో గ్రామాన్ని నడిపించలేకపోవచ్చును అనుభవం ఉన్నా, లేకపోయినా అన్ని ప్రాంతాలనూ సమన్వయంచేసి గ్రామపంచాయతీ బోర్డు అధ్యక్షులు— వారందరూ block level లో కూర్చొని blocks లో తీసుకోవలసిన కార్యక్రమాన్ని విచారించినప్పుడు—వారు తమ గ్రామదృష్టితో, గ్రామ సమస్యలను తీసుకొని, వారి పనుల కొరకు, డబ్బు వాటాకొరకు తగాదా పడడం, మధ్యన nominate చేయబడిన ముగ్గురు, నలుగురు సభ్యుల యొక్క ఓటుల వల్ల, బాధ్యతల వల్ల అటో ఇటో తేలిపోవడం అనేది చాలా శోచనీయమైనది చాలా ముఖ్యమైన కార్యక్రమాలవిషయంలో, పాలసీ విషయంలో, డబ్బు కేటాఇంపు సమస్యలు నిర్ణయించవలసి ఉంటుంది కనుక యిటువంటి పరిస్థితులలో indirect elections ద్వారా వచ్చినవారు nominated committees వారు ఆ బాధ్యతలను నిర్వ

హించలేకపోతున్నారని ప్రభుత్వానికి స్పష్టంచేస్తున్నాను MLAs ను MPs ను కలిపి, Block Council Presidents తో District Councils ను ఏర్పాటుచేస్తారు దానికి executive powers యిస్తున్నారు అట్లా ప్రభుత్వం అధికారాలిస్తే హార్షణీయమే ఇంకా కొన్ని అధికారాలను సంకుచితంచేయడం, లేకపోతే ఏ అధికారాన్ని ఎక్కడ యివ్వాలనే విషయాలలో కొంచెం భేదాభిప్రాయాలుండవచ్చు Block Councils కు అధికారాలు యిచ్చారు పంచాయతీబోర్డుల బడ్జెట్టును కూడా Block Council సవరించాలనీ, అది grant చేస్తేనే ఆ బడ్జెట్ ఆచరణలోనికి రావాలనికూడా యీ White Paper లో ఉన్నది ప్రాణప్రదమైన బడ్జెట్టు సమస్యల మీద Block Councils కు అధికారం యిచ్చినట్లయితే Block Councils లో వివిధ గ్రామాల పంచాయతీబోర్డు అధ్యక్షులుంటారు ఇప్పుడున్న పద్ధతివల్ల గ్రామపంచాయతీ అనేది స్వతంత్రవ్యవస్థ అది గ్రామసమస్యలగురించి అంతిమ నిర్ణయం తీసుకొని, మరల యింకొకసారి నిర్ణయం చేసుకొనేందుకు అధికారంలేకుండా చేస్తున్నారు అట్టి అధికారాన్ని లాక్కున్నారు

డైరెక్టుగా ప్రజలచే ఎన్నుకోబడిన పంచాయతీ బోర్డులయొక్క అధికారాలను, హక్కులను లాక్కొని nominate చేయబడిన Block Councils కు ఇవ్వడంవల్ల అవి పూర్తిగా నిర్వీర్యం, నిరుపయోగం ఐపోతున్నాయి ఈవిధంగా nominate చేయబడిన Block Councils కు ముఖ్యమైన అధికారాలను యివ్వడంవల్ల ప్రజాస్వామ్యాన్ని కుంచింపచేసి, తగ్గింపచేసి decentralisation పేరిట centralisation ను అభివృద్ధిచేయడం జరుగుతోందని నేను మనవి చేస్తున్నాను. Decentralise చేయడానికిప్రభుత్వం perfect democracy ని ఆచరణలో పెట్టినట్లయితే దానిని అన్ని పక్షాలవారుకూడా support చేస్తారు దానిని support చేసి, perfect democracy ని ఆచరణలో పెట్టటానికి మా శక్తిసామర్థ్యాలను contribute చేయడానికి సిద్ధంగా ఉన్నాము ఈ పరిస్థితులలో ఈ బిల్లును ప్రవేశపెట్టి, ఈ White Paper కు background లో, ఆంధ్రప్రాంతంలో జిల్లాబోర్డు Special Officers కు ఇంకొక సంవత్సరంగడువు ఇవ్వాలని కోరుతున్నారు ఈ background ను పరిశీలించిచూస్తే నిజంగా ప్రజల సామాన్యావసరాలను తీర్చేవిధంగా లేదని దానికి వ్యతిరేకంగా ఇది ఉన్నదని చెప్పక తప్పదు. ఇపుడు తెలంగాణా ప్రాంతంలో జిల్లాబోర్డులున్నాయి వాటిని అభివృద్ధిచేయండి. ఆంధ్రప్రాంతంలో కూడా direct elections ద్వారా జిల్లా బోర్డులను నిర్మాణం చేయండి, ముందు ఆంధ్ర-తెలంగాణ ప్రాంతాలలో ప్రత్యక్ష ఎన్నికలద్వారా జిల్లాబోర్డులనుఏర్పాటుచేసి ఈజిల్లా కౌన్సిల్సును, బ్లాక్ కౌన్సిల్సును ఏర్పాటుచేసేసమస్యను convenience ను బట్టి, 1 సంవత్సరంలోనో

2 సంవత్సరాల్లోనో, లేకుంటే 3 సంవత్సరాలలోనో బాగుగా పరిశీలించి చేయవచ్చును వీటిని ఏర్పాటు చేసేటపుడు రాష్ట్రం స్థాయిలో, జిల్లా స్థాయిలో, గ్రామాల స్థాయిలో, వీటిమధ్య ఎన్ని అంతస్థులుండాలి ? వాటికి ఏ విధమైన అధికారాలు ఉండాలి ? అనేటటువంటి విషయాలను మనం అందరం చాలా ఓపికతో, జాగ్రత్తగా ఆలోచించాలి ఇది చాలా ముఖ్యమైన విషయం, మనం administrative structure ను, మారుస్తున్నాం ఇది రాజకీయమైనటువంటి విషయం కాబట్టి దీనిని చాలా ఓపికగా పరిశీలిద్దాం ఈ విధమైనటువంటి పరిశీలనలు జరిగి మనం ఒక నిర్ణయానికి వచ్చేలోపుగా ఆంధ్ర-తెలంగాణా ప్రాంతాలలో జిల్లాబోర్డులకు elections జరిపి వాటిని పునర్నిర్మించాలి ఈ జిల్లాబోర్డులకు ఎన్నికలు జరిగినతరువాత జిల్లా కౌన్సిల్సును ఏర్పాటు చేయాలని మనం నిర్ణయించినట్లయితే, ఆ మార్పు తీసుకువచ్చినపుడు, ప్రజలచే ఎన్నుకోబడిన ఆ జిల్లాబోర్డుల సభ్యులే ఈ కౌన్సిల్సులో elected members గా ఉంటారు అపుడు జిల్లాలు పెద్దవై పోయాయనుకొని తగ్గించాలనుకుంటే యీ elected members ను వారి ఫిర్కాలవారీగా మారిస్తే అందుకు వారు సిద్ధంగా ఉంటారు లేకుంటె, 2, 3, సంవత్సరాల తరువాతనైతే అపుడు కౌన్సిల్సుకు కూడా elections పెట్టుకోవచ్చు ఆ విధంగా జిల్లాబోర్డులను పునర్నిర్మించినట్లయితే సాంఘికవ్యవస్థకు కావలసిన సంస్కరణలు, స్థానిక ప్రజలకు అవసరమైన పనులు జరగడానికి అడ్డంకులు లేకుండా ఉంటుంది ఈ నాడు జిల్లా బోర్డులు చేయవలసిన పనులు సక్రమంగా కొనసాగుటలేదు అందువల్ల జిల్లా బోర్డులను పునర్నిర్మాణం చేయడంవల్ల ప్రజలకు విశ్వాసం కలిగి స్థానిక సమస్యలను పరిష్కారం చేయడానికి అవకాశంవుంది జిల్లాబోర్డులకు కొన్ని అధికారాలను ఒప్పగించినట్లయితే స్థానికంగా ఉన్నటువంటి పనులు సక్రమంగా జరిగి ప్రభుత్వంయొక్క పునర్నిర్మాణ కార్యక్రమాన్ని సాఫీగా సాగించుకోడానికి అవకాశం ఉంటుంది వారు తలపెట్టిన ఈ మార్పులకు జిల్లాబోర్డుల పునర్నిర్మాణం ఏ విధంగానూ అడ్డురాదు కాబట్టి జిల్లాబోర్డులకు ఎన్నికలు పెట్టి ప్రజాస్వామ్యాన్ని అభివృద్ధి చేయాలని ఇపుడు చేయబోయే మార్పులలో కూడా ముఖ్యమైన ప్రజాస్వామ్యాన్ని ఏ విధంగానూ తగ్గించకూడదని, ప్రభుత్వానికి మనవి చేయుచున్నాను. జిల్లాబోర్డులకు ఇపుడున్న అధికారాలే కాక మరికొన్ని అధికారాలను అదనంగా ఇస్తూ ఒక Government order issue చేసి," మీకు ఈ మేరకు అధికారాలు యిస్తున్నాము, ఆ అధికారాల నుపయోగించుకొని వెంటనే అచటి సమస్యలను పరిష్కరించుకోండి " అని చెప్పాలి భవిష్యత్తులో వచ్చే కౌన్సిల్సుకుకూడా ఈ అధికారాలు యివ్వబోతున్నాము అందుచేత ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలలో కూడా ముఖ్యమైన ప్రజా

స్వామిక ప్రాతికదికమైన ఈ జిల్లాబోర్డుల నిర్మాణం చేసి, వాటిని base గా తీసుకొని, క్రొత్త ప్రాజెక్టులను ప్రారంభించుదాము 2, 3 సంవత్సరములు, లేక 4 సంవత్సరములు, అనగా ప్రారంభించిన క్రొత్త ప్రాజెక్టును పూర్తి అయ్యేవరకు చూసి అపుడు మనయంత్రాంగాన్ని, administrative structureను మార్చినట్లయితే అది నిజమైన ప్రజాస్వామిక పద్ధతిలో ప్రజలకు సహకారిగా ఉండి, ప్రజలయొక్క co-operation ను కూడా ఎక్కువగా పొందగలదు ఈ మార్గం కాకుండా మంచి లక్ష్యాల పేరుతో, మంచి సిద్ధాంతాల పేరుతో వేరే మార్గాన్ననుసరించితే ప్రజల సహకారం, సన్నిహితత్వం లేకుండా పోతాయి, ప్రజాస్వామ్యం దెబ్బతింటుంది అసలు ప్రజాస్వామ్య మనేదే లేకుండా చేస్తుంది పంచాయితీ బోర్డులకు వుండేటటువంటి అధికారాలను లాక్కొని, Block Coucils కు యివ్వడంవల్ల ప్రజాస్వామ్యానికి వ్యతిరేక మని చెప్పకతప్పదు మేము చెప్పిన విషయాలను సానుభూతితో విచారించకుండా తమయొక్క నిర్ణయాన్ని తొందరపాటుగా ఆచరణలో పెట్ట డానికి ప్రభుత్వం నిర్ణయిస్తే ఈ బిల్లును వ్యతిరేకించక తప్పదని మనవి చేస్తూ సెలవు తీసుకుంటున్నాను.

*శ్రీ రాజా సాగి సూర్యనారాయణరాజు · అధ్యక్షా, ఈ రోజున మనస్థానిక సంస్థల మంత్రిగారు ప్రతిపాదించిన ఈ amendment ను మనస్ఫూర్తిగా బల పరుస్తున్నాను ఈ విషయంలో ప్రతిపక్షంలోని రాజేశ్వరరావుగారు యించుమించుగా అన్ని విషయాలను అంగీకరించారు ప్రస్తుతం వారు జిల్లాబోర్డులకు ఎన్నికలు జరిపి వాటిని నిర్మాణం చేయాలని కోరుతున్నారు. మేము 2, 3 సంవత్సరాలనుంచి ఈ జిల్లాబోర్డుల విషయంలో ఏ విధంగా చేయమని ప్రభుత్వానికి మనవిచేస్తూ వచ్చామో ఆ విషయాలను ప్రభుత్వంవారు అంగీకరించి యీ White Paper ద్వారా ప్రతిపాదించినందుకు నేను చాలా సంతోషిస్తున్నాను. "ప్రజాస్వామ్యం, ప్రజాస్వామ్యం" అని వారు సెలవిచ్చినదానికి మాత్రం నా కర్థం కావడంలేదు మనకు స్వరాజ్యం వచ్చిన తరువాత మనదేశంలో 2 సార్లు జనరల్ ఎలెక్షన్స్ జరుపుకున్నాము. వాటితోపాటు గ్రామ పంచాయతీ బోర్డుల ఎన్నికలు కూడా జరుపుకున్నాము. ప్రత్యేకంగా ఆంధ్రప్రదేశ్‌లో ఎన్నికలు ఇప్పటికి 3 సార్లు జరుపుకున్నాము. పాకిస్తాన్‌లో స్వరాజ్యం వచ్చి పది సంవత్సరములైనా ఇంతవరకు ఒకసారికూడా ఎన్నికలు జరుపుకోలేదు. వారు మాత్రం democracy పెట్టుకొని నడిపించుకోడంలేదా? మొన్న మొన్ననే పంచాయితీబోర్డు ఎన్నికలను ప్రజాస్వామ్య పద్ధతులమైన జరుపుకున్నాము. ప్రజాభిప్రాయం ఈ ఎన్నికలద్వారా స్పష్టమైనది ఇపుడు జిల్లాబోర్డులకు

ఎన్నికలు జరపాలంటే 40 లక్షల రూపాయలు ఖర్చవుతాయి ఈ సంగతి తెలిసుండికూడా మళ్ళీ ప్రజాభిప్రాయం అనటం, యింతడబ్బు మరల ఖర్చు పెట్టాలనటం ధర్మం కాదని నేను మనవి చేస్తున్నాను పంచాయతీబోర్డు మెంబర్లు, ప్రెశిడెంటులు ప్రజాభిప్రాయం ద్వారా, ప్రజాస్వామ్య పద్ధతులపై ఎన్నికయారు పంచాయతీబోర్డుల అధ్యక్షులు ఈ Block Councils కు, ముగ్గురినో, నలుగురినో లేక అయిదుగురినో co-opt చేసుకుంటారు జిల్లాలో గల ఈ Block Councils యొక్క అధ్యక్షులు అంతాకలిసి వారిలో కొంత మందిని co-opt చేసుకుని జిల్లా కౌన్సిల్సును ఏర్పాటు చేసుకుంటారు ఇలాగా వీటిని ఏర్పాటు చేసుకోవడం ప్రజాస్వామ్యం కాదా? ఏదో సరదాకోసం మనం రోజు రోజుకూ ఎలెక్షన్సు కావాలంటే ఎలాగ? ఎలెక్షన్స్ అనగానే పార్టీల ప్రాబల్యం మొదలైన విషయాలుంటాయి, అనేక చిక్కులుంటాయి అసలు deficit లో నున్న మన ఆంధ్రప్రదేశ్‌లో చాలా డబ్బు ఖర్చయేటట్లు "elections, elections" అనడం, ఇతర రాష్ట్రాలతోటి పోల్చి చూసిన తరువాత మనకు హెచ్చు ప్రజాస్వామ్యం కావాలనుకోవడం మాత్రం ధర్మంకాదని మనవి చేస్తున్నాను ఈ బిల్లులో, District Board Special Officers కు ఒకసంవత్సరం గడువు కావాలని మన మంత్రిగారు సవరణను ప్రతిపాదించారు ఈలోపుననే పంచాయతీలులేని గ్రామాలకు పంచాయితీ బోర్డులను ఏర్పాటుచేసి, వాటి ఎన్నికలు 6 నెలలలో పూర్తి చేయించే పద్ధతులపై నడిపిస్తారని నేను ఆశిస్తున్నాను ఈ మధ్యన చాలా పంచాయితీ బోర్డులకు elections అయిపోయాయి కొన్ని గ్రామాలకు మాత్రం పంచాయితీ ఎన్నికలు జరగకుండా ఉండిపోయాయి అటువంటిచోట్ల, 15 వందలు, 2 వేలు, 2,500 మంది జనాభాగల గ్రామాలకు కూడా పంచాయితీ ఎన్నికలు జరగవలసి ఉన్నది తెలంగాణాలో గ్రామ పంచాయితీలు చాలా తక్కువ వున్నాయని, అందుచేత అచట గ్రామ పంచాయితీలను ఏర్పాటు చేయవలసిన అవసరం ఉందని, వాటిని సాధ్యమైనంత త్వరలో ఏర్పాటుచేయాలని మనవిచేస్తున్నాను మరల ఫిబ్రవరి నెలవరకు ఎసెంబ్లీ బడ్జెట్ session కు meet కావడానికి అవకాశంలేదు అందుచేత ఈలోపున అయినా సరే, ఈ District Councils ను ఏర్పాటుచేసే బిల్లును వెంటనే ప్రతిపాదించి దానిని pass చేసి, సంవత్సరం వరకు time తీసుకోకుండా 6 మాసాలలోనో, 8 మాసాలలోనో అమలుజరిపిస్తారని నేను ఆశిస్తూ సెలవు తీసుకుంటున్నాను.

* శ్రీ కె పున్నయ్య (చీపురుపల్లి - రిజర్వుడు) అధ్యక్షా, లోకల్ బోర్డు మినిస్టరుగారు ప్రతిపాదించిన అమెండ్ మెంట్ బిల్లును బలపరుస్తూ కొన్ని ముఖ్యవిషయాలు మీ దృష్టికి తీసుకువస్తున్నాను ఈ బిల్లుయొక్క ఆబ్జక్ట్స్ అండ్ రీజన్సులోనే యీ స్పెషల్ ఆఫీసర్సు యొక్క పవర్సును ఎటువంటి పరిస్థితుల్లో పొడిగిస్తున్నామో తెలియచేశాను ఇందులో ప్రస్తుతం ఉన్న జిల్లాబోర్డులను రద్దుచేసి అభివృద్ధి కార్యక్రమాలదృష్ట్యా ప్రత్యామ్నాయ వ్యవస్థను స్థాపిస్తూ, యీ గ్రామాభ్యుదయ కార్యక్రమాలు నిర్వహించాలనే ఉద్దేశం ప్రభుత్వానికున్నదనీ, యీ ప్రత్యామ్నాయ వ్యవస్థను స్థాపించి స్పెషల్ ఆఫీసర్సుయొక్క రెజీమ్ ఒక సంవత్సరం పొడిగిస్తామంటున్నారు వైట్ పేపరులో తెలియచేసినటువంటి అభిప్రాయాలు చాలా సమగ్రంగా నే ఉన్నాయి జిలాబోర్డులను రద్దుచేసి యీ గ్రామాభ్యుదయ కార్యక్రమాలకు ఎక్కువ ప్రాధాన్యత ఇస్తూ డిస్ట్రిక్టు డెవలప్ మెంట్ బోర్డు అను పేరుతో ఒక ప్రత్యామ్నాయ వ్యవస్థను స్థాపించుటకు ప్రభుత్వం పూనుకున్నందుకు సంతోషం జిల్లాబోర్డులు ఇదివరకు మంచిపనులే చేసిఉండవచ్చును ప్రస్తుతం ప్రతిగ్రామంలో పంచాయితీ వ్యవస్థను మనం స్థాపిస్తున్నాం ప్లానింగు అండ్ డెవెలప్ మెంట్ స్కీమ్సు క్రింద యస్ ఇ. యన్ బ్లాక్సును ఏర్పాటు చేస్తున్నాం జిల్లాల్లో కూడా ప్లానింగు కమిటీ అనునది ఒకటి ఉన్నది జిల్లాబోర్డులు ఇటు గ్రామాభ్యుదయ కార్యక్రమాలుగాని, గ్రామపంచాయితీ వ్యవహారాలుగాని, యన్ ఇ యస్ స్కీమ్సు ప్రకారం బ్లాక్ కార్యక్రమాలుగాని, జిల్లాలో ప్లానింగు కమిటీ చర్చించిన విషయాలకు మించి ఏమీ చేయలేదనే నా అభిప్రాయము జిల్లాబోర్డుకు ప్రస్తుతం ఉన్న అధికారం కేవలం ఎలిమెంటరీస్కూలు టీచర్సును ట్రాన్సుఫరు చేయడంలాంటి సాధారణ కార్యక్రమాలు తప్ప వేరేమీలేదు మిగిలిన పెద్దపెద్ద కార్యక్రమాలన్నీ ప్రభుత్వమే నిర్వహిస్తున్నది రోడ్లు, హాస్పటల్సు అన్నీకూడ ప్రభుత్వమే నిర్వహించేందుకు ప్రయత్నిస్తున్నది. జిల్లాబోర్డులు చేసే పనేమీలేదు, కాబట్టి వాటిని తొందరగా రద్దుచేయాలని కోరుతున్నారు. ఈ ప్రజాభ్యుదయ కార్యక్రమాలన్నీ ప్లానింగు అండ్ డెవలప్ మెంట్ క్రిందనే ఉన్నవి కనుక డిస్ట్రిక్ట్ ప్లానింగు కౌన్సిలు అనో, డిస్ట్రిక్ట్ ప్లానింగు డెవలెప్ మెంటు బోర్డు అనో ప్రభుత్వం ఏర్పాటు చేస్తున్నందుకు చాలసంతోషం ఎటువంటి పద్ధతుల్లో యీ డిస్ట్రిక్ట్ ప్లానింగు కౌన్సిల్సు ఏర్పాటుకావాలన్నది **matters of details** కాబట్టి ఆ బిల్లు వచ్చినపుడు మనం అన్నీ చర్చించుకుందాం.

ప్రస్తుతం యీ స్పెషల్ ఆఫీసర్సుయొక్క టరము ఒక సంవత్సరం పొడిగించాలి అనేది మన ఎదుటనున్న బిల్లు. సంవత్సరం లోపునయినా ప్రతి

గ్రామంలో పంచాయితీలు ఏర్పాటుచేస్తే బాగుంటుంది శ్రీకాకుళం జిల్లాలో చూస్తే యీ పంచాయితి ఏర్పాట్లు చురుగ్గా జరగడంలేదు కనుక అక్కడ పంచాయితీలు సంవత్సరం లోపల నిర్మాణమైతే బాగుంటుంది ఇప్పటి పరిస్థితులనుబట్టి 3 సంవత్సరములైనా పడుతుందని నాకు భయంగా ఉంది. అన్ని గ్రామాల్లోనూ కూడ ఒక సంవత్సరం లోపులో పంచాయితీలు ఏర్పర చాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను స్పెషల్ ఆఫీసర్ల పరిపాలన కూడ చాల నిరంకుశంగా ఉన్నది ముఖ్యంగా మా శ్రీకాకుళం జిల్లాలో కలక్టరే స్పెషలు ఆఫీసరుగా ఉన్నారు ఆయన ఏ పనులూ సక్రమంగాచేయలేక పోతున్నారు, జిల్లాబోర్డు ఎడ్యుకేషను ఆఫీసరుకు, స్పెషలు ఆఫీసరుకు, పి ఎ కు వారి ముగ్గురికి మధ్య సన్నిహితత్వం ఏమీలేకుండా ఎవరియిష్టం వచ్చినట్లుగా వారు వ్యవహరిస్తున్నారు. ప్రజా ప్రతినిధులమైన మాబోటివారు చెప్పినట్లు కూడా వ్యవహరించక వారిఇష్టం వచ్చినట్టుగా వ్యవహరిస్తున్నారు. అయి నప్పటికి ఏదో ఒక సంవత్సరం టైమ్ లిమిట్ మంత్రిగారు ఇస్తామన్నారు కనుక మేము అంగీకరిస్తున్నాం ఆ స్పెషల్ ఆఫీసరు తన అధికారాన్ని నిరంకుశత్వ ధోరణిలో ఉపయోగించకుండా, ప్రజలయొక్క, ప్రజా ప్రతినిధుల యొక్క అభిప్రాయాలుకూడ కొంతవరకు సేకరించి వారితో సహకరించేందుకు శ్రీ బ్రహ్మానందరెడ్డిగారు చర్య తీసుకోవాలని కోరుతున్నాను ఈ వైట్ పేపరులో యీ డిస్ట్రిక్టుకౌన్సిల్సు నిర్మాణ సందర్భంలో, Women Representation, Harizans and Tribes Representation, Agricultural interests, Social Services Leagues కు సంబంధించిన representatives కూడ ఆ కౌన్సిలులో ఉండాలని నేను కోరుతున్నాను అట్లానే Block Councils, Standing Cammittees ను గురించి ఇక్కడ ప్రస్తావించినారు Agricultural Products, Animal Husbandry, Small Scale Industries, taxation, Co-operation; water supply and drainage అనేటటువంటివాటికి స్టాండింగు కమిటీస్ ఉన్నాయని చెప్పారు ఇవి చాలా అవసరం వాటితోపాటు Education, Health and Sanitation, Communications అనేటటువంటివాటికి స్టాండింగ్ కమిటీస్ ఉంటే మంచిదేమో ఆలోచించాలి ఇంతకన్న చెప్పవలసిన అవసరం లేదనుకుంటాను ప్రత్యేకంగా నేను మనవి చేసినట్లు శ్రీకాకుళం జిల్లాలో ఉన్న స్పెషల్ ఆఫీసర్సు నిరంకుశత్వ ధోరణిని అరికట్టించి సక్రమమైన పద్ధతుల్లో నిర్వహించేందుకు ప్రత్యేక శ్రద్ధ మంత్రిగారు తీసుకుంటారని నమ్ముతూ సెలవుతీసుకుంటున్నాను

*శ్రీ బి శ్రీరామమూర్తి అధ్యక్షా, అసలు జిల్లాబోర్డులు చాలకాలం నుంచి లేవు వాటిని స్థాపించాలని ప్రజలు ప్రభుత్వానికి తెలియపరుస్తున్నారు

ప్రభుత్వముకూడా హామీ ఇవ్వడం జరిగింది కాని జిల్లాబోర్డులు తిరిగి revive అయ్యే పరిస్థితిమాత్రం కనపడ్డంలేదు కాని యీ రోజు జిల్లాబోర్డులను రద్దు చేస్తామంటున్నారు దానికిఅర్థం ఏమిటో తెలియడంలేదు ఇదివరకు అమలులో లేవు కనుక ఇప్పుడు రద్దుచేస్తామంటున్నారు అంటే ఇదివరకు ఆచరణలో, అమలులో లేకుండా చేసేందుకు ఒక కారణాన్ని చూపించేందుకు ప్రభుత్వం ప్రయత్నిస్తోందన్నమాట బల్వంతరాయ్ కమిటీ రిపోర్టు వచ్చింది ఈ రిపోర్టును ఒక సాకుక్రింద తీసుకుని, ఏ అభిప్రాయంతో జిల్లాబోర్డులన్నీ పనిచేయకుండా చేశారో, అదే అభిప్రాయంతో అమలుచేస్తున్నారని నేను భావిస్తున్నాను ఎవరో వ్యక్తులు మొదటినుంచి జిల్లాబోర్డులు పనిచేయడం లేదు, కాబట్టి వాటిని రి-ఆర్గనైజు చేయవలసిన అవసరంఉంది అంటున్నారు మొదటినుంచి పనిచేయడం లేదంటే దానికి కారణం ఏమిటి? ఎప్పుడైనా ప్రభుత్వం దానిని గురించి ఆలోచన చేశారా? చేస్తే తీసుకున్నచర్య ఏమిటి? కొత్తగా కమిటీలు నిర్మాణం చేయబోతున్నారు—(అధ్యక్షా, జిల్లాబోర్డులు పనిచేయటం లేదని వైట్ పేపరులో ఎక్కడా లేదండి—(ఇంటరప్షన్)— ఔనండి They have outlived their usefullness అని ఉంది 'దాని తాలూకు ప్రయోజనం లేదంటే' అప్రయోజకంగా తయారయినాయని అర్థం ఎందుకు సమంగా పనిచేయలేక పోయినాయో ఆలోచించినట్లు కనిపించదు ఇదివరకు జిల్లాబోర్డుల అధ్యక్ష పదవిని స్వీకరించిన ప్రతి పెద్దకూడ ప్రభుత్వంతో గాని, తత్సంబంధమైన వ్యక్తులతో గాని సన్నిహితత్వం ఉన్న వ్యక్తులనే విషయంమాత్రం మరచిపోకూడదు. ఈ రోజున ఏ రూపంలో కమిటీలు ఏర్పాటు చేసినప్పటికీ, దశావతారాలు ఎత్తయినాసరే ఆ కమిటీలో పెద్దలుగా మళ్ళీ వారే తయారవుతారు దాన్ని ఏ విధంగా మారుస్తారని అడుగుతున్నాను

జిల్లాబోర్డ్సు ఏ కారణంచేత వ్యక్తులద్వారా పాడయినవో, తిరిగి ఆ వ్యక్తుల ద్వారా ఆ కమిటీలు నిర్మాణం చేసినా పాడైపోతున్నాయి దానిని prevent చేయుటకు మార్గము ఏమిటని అడుగుతున్నాను. ఇది సరైన విధానముకాదు ఇందులో ఒక విషయం చెప్పారు ఎలెక్షన్లవలన ప్రభుత్వానికి చాలా ఖర్చులు అవుతున్నవని, యీ ఖర్చులు తగ్గించడానికి ఎన్నికలు పెట్టుటలేదని అన్నారు ఇది చాలా ఆశ్చర్యంగా ఉన్నది ఇదే అభిప్రాయం ప్రభుత్వానికి ఉంటే ఎన్నికలకు కావలసిన ప్రయత్నం చేయకపూర్వమే తెలియపరచవలసి ఉండెను కాని ఒక ప్రక్క, ఎన్నికలకు కావలసిన ఏర్పాట్లు చేసుకున్నారు. అవసరమైన ఖర్చులు చేసుకున్నారు, constituencies కు delimitation చేసియున్నారు కావలసిన staff ను వేశారు కాని ఈరోజున, ఎలెక్షన్ ఖర్చులు save చేయ

టానికి ఎన్నికలు పెట్టుటలేదని చెపుతున్నారు ఏ రకంగా save అయినవని అడుగుతున్నాను ఒక ముఖ్య విషయం అందరూ ఆలోచించాలి ఎలెక్షన్ అంటే ఖర్చుతో కూడినపని ఈ ఖర్చు save చేయాలని ప్రయత్నం చేస్తున్నామని చెప్పటం, దేశంలో ప్రజాస్వామ్య పరిపాలన లేకుండా చేయటానికి ప్రయత్నం చేస్తున్నట్లు అని అర్థం నిర్మాణ కార్యక్రమాలకు, అభివృద్ధి ప్రణాళికలకు డబ్బు కావాలి కాబట్టి ఎన్నికలు పెట్టుటలేదని అంటున్నారు. అనగా అభివృద్ధి ప్రణాళికలకు, ప్రజా స్వామ్యానికి మధ్య, పరస్పర విరుద్ధమైన కృత్రిమ పోటీ ప్రభుత్వం సృష్టిస్తున్నదని తెలుస్తున్నది ప్రజాస్వామికంమీద గొడ్డలిపెట్టు పెట్టితేగాని ప్రణాళిక కార్యక్రమం నడవదని ప్రభుత్వభావమా అని అడుగుతున్నాను అయితే, యిది ప్రజాస్వామ్యమును సంకుచితము చేయుటకు జరుగుతున్న ప్రయత్నం, అందులో సందేహంలేదు బలవంతరాయి కమిటీ రిపోర్టు ప్రధానంగా indirect elections మీద ఆధారపడి ఉన్నది. ఇన్‌డైరెక్టు ఎలెక్షన్ల పద్ధతి ప్రజా స్వామ్యాన్ని సంకుచితం చేస్తుంది. అది సంభవించటానికి వీలులేదు బ్లాక్‌బోర్డు (Block Board) నిర్మాణం ఏవిధంగా జరుగుతుంది ? గ్రామ పంచాయితీలను గ్రూప్‌చేసి అందులోనుంచి ప్రతినిధులను బ్లాక్‌బోర్డుకు పంపుతారు కేవలం ఇన్‌డైరెక్టుగా ఎలక్ట్ అయిన మెంబర్సుతో బ్లాక్‌బోర్డ్సు ఏర్పడతాయి అంతేకాదు అందులో 5 గురు నామినేట్ అవుతారు 5 గురు సభ్యులు ఉంటారు వీరికైనా స్వాతంత్ర్యం, స్వేచ్ఛలేదు బ్లాక్‌బోర్డు తాలూకు ప్రతి ఒక్క విషయం జిల్లా కౌన్సిల్ అప్రూవ్ చేయాలి చేయకపోతే బడ్జెటును అమలు జరపటానికి వీలులేదు జిల్లా కౌన్సిలు ఏరకంగా ఏర్పడుతుంది? అందులో, యింకొక purpose కోసం ఎలెక్ట్ అయిన M L As M. Ps ఉంటారు. వారు అప్రూవ్ చేస్తేనే, యీ బ్లాక్‌బోర్డు బడ్జెటు అమలు జరగటానికి అవకాశం ఉంటుంది ఈ విధంగా జరిగితే ప్రజాస్వామికం ఎక్కడ ఉన్నదని అడుగుతున్నాను వికేంద్రీకరణ విధానం కావాలని ప్రయత్నంచేస్తూ, జిల్లా కౌన్సిల్ చేతులలో బ్లాక్‌బోర్డు బడ్జెటు పెట్టి వారు ముద్ర వేస్తేనే వీరు ముందుకు వెళ్ళాలని చెప్పటం, ముందుకాళ్ళకు బందాలు వేస్తున్నట్లుంది. ఇందులో వికేంద్రీకరణ విధానంలేదు ఇప్పుడు దేశంలో నూటికి 42 వంతుల ప్రాంతంలోనే బ్లాక్సు ఉన్నవి మిగతా 58 వంతుల ప్రాంతంలో బ్లాక్సు లేవు ఈ ప్రాంతాలలో ఏ రకమైన local-administration ను ప్రభుత్వం నిర్మాణం చేయదలచుకున్నారని అడుగుతున్నాను అటువంటి ప్రాంతాలలో జిల్లా కౌన్సిల్సు ద్వారా పరిపాలిస్తామని చెప్పారు అంటే అర్థము ఏమిటి ? ఇన్‌డైరెక్టుగా ఎలెక్టు అయిన ప్రతినిధులకైనా దీనిమీద పూచీలేదు. నామినేటయిన మెంబర్సుతో కూడిన జిల్లా కౌన్సిలు, ఇంకొక purpose కోసం ఎలెక్టు అయిన

M L As M Ps దీనిని నడిపిస్తారు ఇది ప్రజాస్వామ్యం పెంచటంకోసం చేస్తున్నపనా? లేక త్రుంచటంకోసం చేస్తున్నపనా? ఇంతేకాదు, ఈ కారణాల వల్ల జిల్లాబోర్డ్సు గద్దుకావటానికి వీల్లేదు జిల్లా కౌన్సిల్సు ఆర్గనైజు అయ్యే పర్యంతమైనా జిల్లాబోర్డ్సు ఉండితీరాలి ప్రజలచేత ఎన్నికైన ప్రజా ప్రతినిధుల ద్వారా పరిపాలన జరపాలి ఇది సరైన విధానం ఎందుకంటే ప్రధానమైన ఒక సూత్రంమీద యీ కమిటీరిపోర్టు ఆధారపడి ఉన్నది జిల్లాలన్నీ uniform గా ఒకే రకమైన విస్తీర్ణం కలిగిలేవు ఒక జిల్లాలో 7 లక్షల జనాభావుంటే యింకొక జిల్లాలో 30 లక్షలు ఉన్నది ఈ వ్యత్యాసం తగ్గించుటకు జిల్లాల బౌండరీలు re-demarcate చేయాలని ఒకసూచన ఉన్నది ఆపని జరిగే పర్యంతమైనా ప్రజలచేత ఎన్నికైన ప్రతినిధులద్వారా జిల్లాపరిపాలన సాగించండి ఒకప్రక్క రెవిన్యూ అడ్మినిస్ట్రేషన్‌కోసం డిస్ట్రిక్టును లెవెల్ యూనిట్‌గా తీసుకొంటూ లోకల్ అడ్మినిస్ట్రేషన్ కోసం డిస్ట్రిక్టును యూనిట్‌గా తీసుకొనుటకు ఎందుకు వీలులేదు? ఇందులో ముఖ్యంగా రాజకీయ ఉద్దేశం ఉన్నదని స్పష్టమౌతున్నది బ్లాక్ లెవెల్‌లో ప్రజాద్రవ్యం వినియోగించి కొంత పనిచేస్తున్నారు ప్రతి పనిలో ప్రభుత్వంలో ఉన్న పార్టీకి ప్రత్యక్షంగా సంబంధం కలిగిస్తే ఆ పని అంతా తమ పార్టీయే చేస్తున్నట్లు, ఆ పేరు ప్రతిష్టలు తమ పార్టీ వినియోగించుకొనుట కొరకు ఉద్దేశించబడినట్లవుతుంది ఈ రకంగా శాశ్వతంగా తమ పార్టీ పునాదులు నిర్మించుకొనుటకు చేస్తున్న ఒక కృత్రిమరాజకీయ యత్నం అని నేను భావిస్తున్నాను ఈరోజు జిల్లా లెవెల్ అడ్మినిస్ట్రేషన్ ప్రజా ప్రతినిధులద్వారా జరగాలి పోలీసు మీదపెత్తనంకూడ జిల్లా లెవెల్‌లో ఉన్న యంత్రాంగానికి యివ్వాలి ప్రణాళికా కార్యక్రమం, రెవిన్యూలో కనీసం నాల్గవవంతు డబ్బు, జిల్లా లెవెల్‌లో వారికియిచ్చి, ఖర్చుచేయవలసిన అవకాశం కల్పించవలసిన పరిస్థితి ఉన్నది అదేరకంగా గ్రామాలలో జరగాలి అట్లా చేస్తే సరైన ప్రజాపరిపాలనకు అవకాశంవుంటుంది జిల్లా పరిపాలన బాగుండలేదని, దానిని రద్దుచేయాలని ఈప్రభుత్వం నిర్ణయించుకుంటే, ఈ రాష్ట్ర ప్రభుత్వ పరిపాలన సక్రమంగా లేదని కేంద్రప్రభుత్వం, రాష్ట్ర ప్రభుత్వాన్ని రద్దుచేయుటకు అవకాశం ఉన్నదా అని అడుగుతున్నాను ఈ white papers కు ఆధారంచేసుకొన్న బలవంతరాయి కమిటీ రిపోర్టును యీ ప్రభుత్వం అంగీకరించిందా? దానిమీద ప్రభుత్వమునకు ఎటువంటి అభిప్రాయములు ఉన్నవి? ఆ అభిప్రాయములేమిటో యీ సభముందు పెట్టే టటువంటి ప్రయత్నం చేయలేదు ప్రభుత్వానికి మనస్సులో ఏమిఉన్నదో మాకు తెలువలేదు. అందుచేత దానిమీద చర్చ ఏ రకంగా జరుగుతుంది? మీరు ఏ మార్పు తీసుకు రాదలచుకొన్నా.........

మిస్టర్ స్పీకర్ 'వారు' అనండి మనం పార్లమెంటరీ సాంప్రదాయాన్ని develop చేద్దాము

శ్రీ బి శ్రీరామమూర్తి Yes Sir, ఈ ప్రభుత్వం ఎటువంటి మార్పు తీసుకు రాదలచుకొన్నా, మొదట ఏరకమైనటువంటి జిల్లా అడ్మినిస్ట్రేషన్, లోకల్ అడ్మినిస్ట్రేషన్ ఉన్నదో, అదే అడ్మినిస్ట్రేషన్ తిరిగి ఉండేటట్లు చేయాలని ప్రార్థిస్తున్నాను ఇది నా ఖచ్చితమైన అభిప్రాయం దానికి విరుద్ధముగా చేసే ప్రయత్నం, ప్రజాస్వామికమునకు దెబ్బ వికేంద్రీకరణమునకు దెబ్బ ఆర్థిక వికేంద్రీకరణముతో కూడిన (రాజకీయ) పరిపాలనా వికేంద్రీకరణము కూడ కావాలంటున్నాము ఆర్థికంగా స్వయం సంపూర్ణంకావాలి వీటిమీద పెత్తనం యింకొకరి పిడికిటిలో పెట్టితే సమానంగా నడవదు ఈ indirect ఎన్నికల పద్ధతి పూర్తిగా పోవాలి ప్రత్యక్ష ఎన్నికలు జరపాలి ప్రజలచేత ఎన్నుకొనబడిన ప్రతినిధుల ద్వారా పరిపాలన జరగాలి కొత్త మార్పులు వచ్చేవరకు, పాత జిల్లా బోర్డుకు ఎన్నికలు జరగాలి. ఇది సరైన విధానమని చెప్తూ సెలవుతీసుకొంటున్నాను

*పి వెంకటసుబ్బయ్య (రాజంపేట - రిజర్వుడు) అధ్యక్షా, రెవిన్యూ మంత్రిగారు ప్రవేశపెట్టిన సర్ ఛార్జి బిల్లులు బలపరుస్తు నేను కొన్ని సూచనలు చేయదలచుకున్నాను ఈ డిస్ట్రిక్టుబోర్డ్సు మ్యునిసిపాలిటీస్ ఆక్టు 1922 సం లో చేయబడినది ఆ యాక్టుప్రకారం డిస్ట్రిక్టు బోర్డ్సు, తాలూకా బోర్డ్సు ఏర్పడినవి మద్రాసు ఉమ్మడి రాష్ట్రములోను, తరువాత ఆంధ్రరాష్ట్రములోను ఆయాక్టును అనుసరిస్తూ వచ్చాము అవి సక్రమంగా నిర్వహింపబడుట లేదనే ఉద్దేశముతో, రాజగోపాలాచారిగారు జిల్లాబోర్డ్సును రద్దుచేసి స్పెషల్ ఆఫీసర్ పరిపాలనక్రింద ఉంచినారు ఆనాటినుండి నేటివరకు వాటికి ప్రత్యామ్నాయసంఘాలు ఏర్పాటు చేసుకొనవలెననే ఉద్దేశంతో, వాటి పునరుద్ధరణ విషయం వాయిదా వేస్తూ వచ్చారు ఈ బిల్లు ఆబ్జెక్ట్స్ అండ్ రీజన్సులో చెప్పినప్రకారం పంచాయితీలు స్వయంపరిపాలక యూనిట్సుగా తయారుచేస్తూ ఆర్థికస్తోమత కల్పించి వాటి ద్వారా మనము, జిల్లాలోవుండే వ్యవహారాలు జరుపుకొనవలెనని తీర్మానించినట్లు తెలుస్తున్నది ప్రభుత్వం ప్రకటించిన వైట్ పేపర్ లో అవేవిషయాలు సూచించారు ఈ పంచాయితీలు స్వయంపరిపాలక యూనిట్సుగా ఏర్పాటయిన నాడు, మహాత్మాగాంధిగారు కలలుకనిన పంచాయితీ రాజ్యం, అనగా రామ రాజ్యం ఏర్పడుతుంది. ఈ అభిప్రాయం ప్రభుత్వమునకు కలిగినందుకు, దానిని అమలులో పెట్టుటకు ఈ వైట్ పేపర్ యిచ్చినందుకు నేను చాలా సంతోష

పడుతున్నాను మన ప్రభుత్వం జాతీయపిత మహాత్మా గాంధిగారి కోరిక ననుసరించి ఈ విధానం అమలు పెట్టబడుచున్నందుకు సంతోషించవలసి యున్నది

అయితే ఒక విషయం నేను మనవిచేస్తాను. పంచాయితీలు స్వయం పరిపాలక సంఘాలుగా ఉండాలి అని మనం అంటున్నాము అంటే వికేంద్రీకరణ పద్ధతిని ఆమోదిస్తున్నామన్నమాట వికేంద్రీకరణ పద్ధతి అన్నప్పుడు, పంచాయితీలకు సర్వాధికారాలు అప్పగించాలి వాటికి పూర్తి ఆర్థికస్థోమత చేకూరాలి అవి సమగ్రంగా గ్రామాల్లో ఉన్న అన్ని వ్యవహారాలు, (చివరకు కోర్టు వ్యవహారాలు కూడ) చూసుకొంటూ, పరిపాలన చేసుకొనేటట్లు చేయాలి ఆవిధంగా పంచాయితీలను స్వయం పరిపాలక యూనిట్స్‌గా ఏర్పాటుచేసినట్లయితే, అవి దేశానికి పునాదిగా ప్రభవిల్లి, సక్రమంగా పరిపాలన చేసుకోగలుగుతాయని మనం అనుకొంటున్నాము ఇప్పుడు వైట్ పేపర్‌లో పెట్టిన అంశాల ద్వారా, గ్రామపంచాయితీలకు ఉన్న అధికారాలను సంకుచితం చేస్తున్నాము పంచాయితీలలో కొంతమందిసభ్యులు, ప్రెసిడెంటు వగైరా ఉంటారు ఒక బ్లాక్ ఏరియాలో 60 గ్రామాలు ఉంటే, అందులో 50 గ్రామాలకు పంచాయతీబోర్డులు ఉంటే, ఆ 50 మంది పంచాయితీ అధ్యక్షులు బ్లాక్ కౌన్సిల్‌లో సభ్యులుగా ఉంటారు పంచాయితీకి సంబంధించిన బడ్జెటు బ్లాక్ కౌన్సిల్‌లో చర్చింపబడుతుంది అంటే ఆ పంచాయితీబోర్డుతాలూకు ఒక్క అధ్యక్షుడుమాత్రమే యీ సభలో కూర్చుని చర్చించవలసివస్తుంది అందుచేత ఆ గ్రామానికి సంబంధించినవ్యవహారం చర్చింపబడేటప్పుడు పంచాయితీలో ఉండేటటువంటి సభ్యులందరకు సంపూర్ణమైన జోక్యం ఉండకుండా పోవటంచేత, యీపద్ధతి సరైనదికాదని మనవిచేస్తున్నాను పంచాయితీలు స్వయంసమృద్ధంగా ఉండాలంటే, మంచి అధికారంకలిగి అవి బలపడాలంటే, వాటికి స్థానే వేరే బ్లాక్ కౌన్సిల్సు పెట్టటం అంత సముచితం కాదని అనుకొంటాను ఎందుకంటే, పంచాయితీల యొక్క బడ్జెటుకూడ విమర్శించే తాహతు యీ కౌన్సిలుకు ఉన్నది మనము తాలూకాబోర్డులు తీసేశాము ఈ బ్లాక్ కౌన్సిల్సు ఫిర్కాబోర్డులుఅనుకోవచ్చు, ఏ పేరన్నా పెట్టండి. తాలూకా బోర్డులుగానో, ఫిర్కా బోర్డులుగానో, డిస్ట్రిక్టు లెవెల్‌లో ఉన్న ఒక కమిటీకి, డిస్ట్రిక్టుకౌన్సిల్ అని పేరు పెట్టినా, అది ఒక జిల్లాబోర్డుగా వ్యవహారం జరుపుకోవలసివస్తుంది "జిల్లాబోర్డులు వద్దు; అవి సరిగా పనిచేయటంలేదు, అని వికేంద్రీకరణ పద్ధతి ఒప్పుకొంటున్నాము" ఆవిధంగా అనుకొన్నప్పుడు వాటి స్థానంలో వేరే రూపంలో ఇంకో సంఘాలు పెట్టటం బాగా ఉండదని నేను మనవిచేస్తున్నాను. బ్లాక్ కౌన్సిల్‌లో ఒక బ్లాక్ డెవలప్‌మెంట్ ఆఫీసర్‌ను వేస్తారు. ఆ బ్లాక్ డెవలప్‌మెంట్ ఆఫీసర్‌కు సర్వాధికారం ఉంటుంది ఆయన పంచాయితీబోర్డుల వ్యవహారం కూడ చూడవలసిఉండును కనుక బ్లాక్ డెవలప్

మెంట్ ఆఫీసర్సు గెజెటెడ్ ఆఫీసర్సుగా ఉండాలని సూచించబడింది ఒక జిల్లాలో 20 బ్లాక్స్ ఉన్నప్పుడు, 20మంది గెజెటెడ్ ఆఫీసర్సును ఆ ఒక్క జిల్లాలో పెట్ట వలసివస్తుంది మనం ఇప్పుడు పొదుపుఉద్యమం కావాలంటున్నాము ఖర్చులు తగ్గించుకోవాలనుకొంటున్నాము ఎస్టాబ్లిష్ మెంట్ ఖర్చులు జాస్తీఅవుతున్నా యని అనుకొంటున్నాము అటువంటిపరిస్థితుల్లో, ఒక్కొక్కజిల్లాలో 20మంది గెజెటెడ్ ఆఫీసర్సును వేసుకోవటం వల్ల ఖర్చు ఎక్కువఅవుతుంది పంచాయితీ బోర్డుఅధ్యక్షులు, వారితో కూడినటువంటి యీ వ్యవహారాన్ని పరిశీలించటానికి ఇప్పుడు బ్లాక్ డెవలెప్ మెంట్ ఆఫీసరుగా తహశీల్ దారునే ఆ ఉద్యోగానికికూడ అప్పజెప్పితే బాగుంటుంది ప్రతి పంచాయితీలోను రోడ్లు వేయించటము, హాస్పటల్స్ ఏర్పాటుచేయించటం మొదలైన కార్యక్రమాలు అక్కడి ప్రజల యొక్క ఉత్సాహము, సహకారము మీద ఆధారపడిఉంటుంది వారి ఉత్సాహము, సహకారము మనకు కావాలంటే, "మేమే పరిపాలన సాగించుకొంటున్నాము" అనే అభిప్రాయం వారిలో కలగాలి లేకపోతే యీ కార్యక్రమాలు సరిగా జరగవు అక్కడ ఉన్నటువంటి వ్యక్తులకు ప్రోత్సాహము కలుగుటకు వారికే అధికారాలు అప్పజెప్పి, వికేంద్రీకరణ పద్ధతిలో, ఆ పంచాయితీబోర్డులే సర్వ కార్యక్రమాలు నిర్వహించుకొనేటట్లు చేయాలి బ్లాక్ లెవెల్ ఆఫీసర్సును సలహాదార్లుగా పెట్టి, వారు సలహాలు ఇస్తూంటే, పంచాయితీబోర్డులు సక్రమంగా పనిచేయగలుగుతాయి ఇప్పుడు పంచాయితీబోర్డులకు ఆర్థిక స్థోమత లేదు కనుక ఫైనాన్స్ కార్పొరేషన్‌ను పెట్టి, సహకారరీత్యా పంచాయితిలకు ఆర్థికంగా సహాయం చేస్తూవస్తే, కార్యక్రమాలు సక్రమంగా జరుగుతాయి పంచాయితీలకు ఆర్థిక స్థోమత కలిగించకుండా, వాటి అధికారాలను తీసివేసి వేరే జిల్లా కౌన్సిళ్ళకు అప్పగించటం వల్ల ఆ కార్యక్రమాలు సక్రమంగా జరగవు

సెంట్రల్ కౌన్సిల్ ఆఫ్ లోకల్ సెల్ఫ్ గవర్న మెంటువారు ఒక తీర్మానం చేశారు ఆ తీర్మానం ప్రకారం శ్రీ సి డి బర్ఫీవాల అనేవారు డ్రాఫ్ట్ మోడల్ యాక్టు ఫర్ లోకల్ బోర్డ్సు అనేదానిని తయారుచేస్తున్నట్లు, యీ '10 సం.ల అభ్యుదయ కార్యక్రమం' అన్న గ్రంథంలో వ్రాయబడింది, కనుక ఆ మోడల్ యాక్టు వచ్చేంతవరకు వేచియుండి, వారు దానిని ఏ పద్ధతిన రూపొందిస్తారో చూసుకొని, దానికి అనుగుణంగా మనపద్ధతి మార్చుకొంటే బాగా ఉంటుందని మనవిచేస్తున్నాను. ఈ పంచాయితీలకు సమగ్రమైన అధికారాలు అప్పచెప్పి అవే ప్రాతిపదిక సంస్థలుగా ఉండేటట్లు రూపొందించాలని మనవిచేస్తూ సెలవుతీసుకొంటున్నాను.

* కె సుబ్బారావు అధ్యక్షా, ఈ జిల్లాబోర్డుల విషయమై మంత్రిగారు తెచ్చిన బిల్లు చూసిన, మహాభారతములో భీష్ముని చంపేటటువంటి ఘట్టము జ్ఞాపకము వస్తున్నది శిఖండిని అడ్డము పెట్టుకొని భీష్ముని చంపినట్లు యీ వైట్ పేపరు (తెల్లకాగితము) సభ్యులకు చూపి, ప్రజలకు చూపి, డిస్ట్రిక్ట్ కౌన్సిల్సు గురించి ఏమీ చెప్పకుండా, స్పెషల్ ఆఫీసర్సను ఎక్స్టెండ్ చేసే దానికి పన్నిన పన్నాగము తప్ప, ఇంకొకటి కాదు మొగల్ దర్బారులో ఉండే ఏ మహారాజులకు లేని అధికారములు యీ దినం స్పెషల్ ఆఫీసరు అయిన కలెక్టర్లకు ఉన్నవి తిరిగి స్పెషల్ ఆఫీసర్సనే కంటిన్యూ చేస్తాము అన్నది మనస్సులో పెట్టుకొని, యీ బిల్లు ప్రజలచేత పాస్ చేయించుకొనుటకు సభవారిముందు పెట్టి, దీనికి యీ విధమైన రూపురేఖలు దిద్ది, యీ ప్రజా రాజ్యములో ప్రజలకు ఏ ఏ అధికారములు, ఏ ఏ ప్రాంతములలో, ఎవరెవరికి ఇస్తే బాగుంటుంది అనేదానికి ఒక కాగితను చూపించే వ్యవహారము జరుగు తున్నది కాని, మంచిదే బుర్రకోబుద్ధి అన్నట్లు, అనేకులకు అనేకబుద్ధులున్నవి ఆ బుద్ధిప్రకారము రేపు ఎట్లు రూపురేఖలు తీర్చి, సభవారిఎదుట, ప్రజలఎదుట ఎట్లు పెడుదురో, ఆ సందర్భమట్లుండగా, డిస్ట్రిక్ట్ స్పెషల్ ఆఫీసర్సు గురించి ఒక విషయం చెప్పెదను స్పెషల్ ఆఫీసర్సుకు యీ అధికారములు ఉండ కూడదు ఈ అధికారములు ఉండకుండా, ఇప్పుడు డిస్ట్రిక్ట్ కౌన్సిల్సు అన్నటు వంటివి ముందు బ్లాక్ హెడ్సో, బ్లాక్ కౌన్సిల్సో, ఎవరొస్తారో, ఆ విషయము అట్లుండగా ఇప్పుడే యీ మెంబర్సుతో బ్లాక్ కౌన్సిల్సు, డిస్ట్రిక్ట్ కౌన్సిల్సు చేసి, డిస్ట్రిక్ట్ కౌన్సిలులో ఒక ప్రసిడెంటును మెంబర్సు అంతా కలిసి ఎన్నుకొను నట్లు చేసి జిల్లాబోర్డు పరిపాలన చేయించేటటువంటిది సవ్యముగా ఉండును, అది సమగ్రముగా ఉండును కలెక్టర్లు ప్రసిడెంట్గా సర్వాంసహా చక్రవర్తు లుగా అక్కడ కూర్చుని పరిపాలన చేస్తూంటే, నిజమైన మర్యాద కలిగినటు వంటి సభ్యుడు "ఇది బాగాలేదు, ఇది అవమానకరము" అని అనేకదినములుగా చెబుతున్నప్పటికీ, ముందు ఏదో తేబోతున్నామని, మళ్ళీ యీ స్పెషల్ ఆఫీసర్సను ఆరునెలలో, లేక ఒక సంవత్సరమో పొడిగిస్తామని చెప్పుట మంచిదికాదు డిస్ట్రిక్ట్ కౌన్సిల్సులో ఉండేటటువటి డిస్ట్రిక్టు కౌన్సిల్స్ మెంబర్సుతో ప్రెసిడెంటును ఎలక్టు చేసుకొని, యీ బ్లాక్ కౌన్సిల్సు ఏర్పాటు చేయుటకు ఎన్నిదినములు పడుతుందో, అంతవరకు ప్రజలచేత ఎన్నుకోబడిన సభ్యులతో డిస్ట్రిక్టు కౌన్సిల్సు ఏర్పాటుచేసి, ప్రెసిడెంటును ఆ సభ్యులు ఎన్ను కొనునట్లు చేసి, ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు అనునతడు లేకుండా, కలెక్టర్కు ఏమీ సంబంధము లేకుండా, సెక్రటరీనే పెట్టి, ఆ డిస్ట్రిక్టుబోర్డు సెక్రటరీస్ చేతనే పరిపాలన చేయించేపద్ధతి చేస్తే బాగుంటుందని నేను చెబుతున్నాను.

**श्री रंगनाथ राव** (आदिलाबाद) मानेनीय अध्यक्षजी—आज हाउस के सामने डिस्ट्रिक्ट बोडस एमेंडिग बिल आया है। इसके साथ ही एक वाइट पेपर भी हमारे सामने रखा गया है जिसका मतलब मै जहा तक समझता हूँ यह है कि पीछे से एक ब्याक डोर रखा गया है। वाइट पेपर में यह बतलाया गया है कि हर मौजे देहात और ताल्लुके और साथ ही साथ हर जिले के अभिउदय के लिये एडमिनिस्ट्रेशन मे एक रेडिकल चेंज (radical change) लाने की कोशिश की जा रही है। और इस नुकतेनजर से इस बिल के जरिये एक्जीक्यूटिव आफीसर्स या स्पेशल अफीसर्स को ज्यादा अधिकार देने मे आप मदद कर रहे है। डिस्ट्रिक्ट बोर्डस मे जो एक्जीक्यूटिव आफीसस तेलगाना एरिया मे सेक्रेट्रीज और आन्ध्र एरिया मे स्पेशल आफीसर्स हैं उन्हें एडमिनिस्ट्रेशन मे जो पावर्स हैं और उनके जो रिवायात हैं उनको हमारे एक दोस्त ने हाउस के सामने रखा उसको सामने रखते हुए हमे इस एमेंडिग बिल को कुबूल नहीं करना चाहिये। हमारे देश के विकास और अभिउदय के लिये और हर इन्सान की आर्थिक स्थिति को ठीक करने के लिये जैसा कि वाइट पेपर मे बतलाया गया है आप चाहते हैं कि हर मौजा अपने तौर पर सेल्फ सुफीशेंट हो। इसको सामने रखते हुए पचायत कमेटीज साथ ही साथ पचायत ब्लाक्स या यूनिट्स को जितने अधिकार देना चाहिये उनको इस बिल मे उतना क्लियरली (clearly) नहीं बतलाया गया है। साथ ही साथ पंचयत कमेटीज या डिस्ट्रिक्ट बोर्डस के फाइनाशल पोजीशन (financial position) का ठीक तौर पर क्लेरिफिकेशन (clarification) भी नहीं किया गया है। जहा तक मै समझता हू आज डिस्ट्रिक्ट बोर्डस का फाइनाशल पोजीशन बहुत कमजोर है। ऐसी सूरत में यह पचायत यूनिट्स या ब्लक्स या पचायत कमेटीज कैसे सेल्फ सफीशेंट (self sufficient) रहेंगे। इसलिये उनकी इकम (income) बढ़ाने के लिये जो मद (item) बतलाया गया है उसमें और बहुत कुछ एड (add) करने की जरूरत है क्यूंकि जो चीफ सोर्सेस आफ रेवेन्यू (sources of revenue) बतलाये गये हैं वह बहुत ही कम हैं। मै कहूगा कि जिस मौजे में पचायत कमेटी होती है वहा की एक्साइज इन्कम का 40% उस पंचायत कमेटी को देना चाहिये। साथ ही साथ उस जूरिस्डिकशन (jurisdiction) के लेड रेवेन्यू का 25% से 40% तक ग्राट के तौर पर compulsorily वहां की पंचायत कमेटी को देना चाहिये। उसी वक्त वह पंचायत कमेटी काम कर सकती है।

दूसरी चीज मुझे यह कहना है कि पचायत कमेटीज़ और साथ ही साथ डेवलपमेंट ब्लाक्स में जो कमेटीज काम करती हैं उन्हें एक्जीक्यूटिव पावर्स (executive powers) देना चाहिये। हम देखते हैं कि आज उन के हाथ में यह पावर्स न होने की वजह से उनहे अपने रेजोल्यूशस या प्लास जिन्हें वह पास करते हैं अमल में लाने में मुशकिलात का सामना करना पड़ता है। मै कहूंगा कि इन कमेटीज को पूरा पूरा अधिकार देना

चाहिये और कमेटीज के अन्दर जो एडमिनिस्ट्रेटिव स्टाफ (Administrative Staff) काम करता है वह कमेटी के पूरे कन्ट्रोल मे रहना चाहिये ताकि जो रेजोल्यूशस या प्लास पास होते हैं उनको वह ठीक ढग से अमल मे लासके।

साथ ही साथ जो डिस्ट्रिक्ट डेवलपमेंट कौंसिल्स बन रहे हैं जहा तक मै समझता हूं वह एक एडवाइजरी बाडी (Advisory Body) स्वरूप मे रहेंगे। मै कहूगा कि उन्हें वैसा ही न रखते हुए उनको एक्जीक्यूटिव पावर्स भी देना चाहिये। ताकि वह ठीक ढंग से डेवलपमेंट के कामों में हाथ बटा सके।

इतना कहते हुए मै अपना भाषण समाप्त करता हूं।

[Sri Mahboob Ali Khan (Kurnool)] شری محبوب علی خان (کرنول)
ـ جناب صدر صاحب ـ ڈسٹرکٹ بورڈس کو منقود کرنے کے لئے آج یہ بل (Bill)
لایا گیا ہے ۔ میں اسکی تائید کرتے ہوئے عرض کرونگا کہ شری راج گوپال چاری
کے دور حکومت سے ڈسٹرکٹ بورڈ رد ہوچکا تھا اسلئے اسکو رد کرنا ہی تھا
ہے ۔ اب اس کونسل کو لانے کیلئے تمام حضرات حکومت کی توجہ دلا رہے
تھے مگر حکومت کو شائد اب خیال ہوا کہ وہ ڈسٹرکٹ بورڈ رد کردیا جائے ۔
چونکہ وہ ٹھیک نہیں تھا اس لئے رد کردیا گیا ۔ جس ، اب ایک پلاننگ کمیٹی
رکھی گئی ہے ۔ یہہ ڈیولپمنٹ پلاننگ کمیٹی جو رکھی گئی ہے اسکے لئے
اسپشل آفیسر ہے ۔ انجنیرس (Engineers) ہیں اور ایجوکیشنل افسر بھی ہے ۔ اس
قسم کی یہہ جو کونسل ہے اسکا نام ڈسٹرکٹ کونسل رکھا جارہا ہے ۔ اسمیں
کوئی مشکل نہیں ہے اور بہتر ہوگا کہ وہ جلد سے جلد عمل میں لائی جائے
مگر بہت سارے لوگوں کے خیالات سے پتہ چل رہا ہے کہ اس بورڈ میں اسپیشل
آفسر کو نہ رکھا جائے ۔ جہانتک میرا خیال ہے میونسپالیٹی کے اختیارات چیرمن
صاحب کو ہیں باوجود اسکے کہ چیرمن صاحب کو اختیارات ہیں ایک اسپیشل
آفیسر یعنی کمشنر مقرر کرکے جو بھیجا گیا ہے وہ بہت اچھا ہے ۔ اڈمنسٹریشن کے
قیام میں ڈسٹرکٹ کلکٹر کے ساتھہ اسکا الحاق ضروری ہے ۔ چونکہ ڈسٹرکٹ کے
کاروبار کلکٹر سے وابستہ ہیں اسلئے کلکٹر کا اس کونسل میں رہنا ضروری ہے ۔
بشرطیکہ جیسا کہ ابھی بعض ممبروں نے کہا کہ پریسیڈنٹ کو ممبروں میں شریک
کردیا جائے اور کلکٹر کو وائیس پریسیڈنٹ رکھا جائے تو مناسب ہے ۔ یا اگر
کلکٹر پریسیڈنٹ ہو تو اس کو نان آفیشیل ممبر کی حیثیت سے رکھا جائے ۔ اسکی
وجہہ یہہ ہے کہ کلکٹر صاحب کو ڈسٹرکٹ کے کاروبار سے فرصت نہیں ملتی ۔
ڈسٹرکٹ بورڈ کے آفسر صاحب تمام کام پی ۔ اے ۔ (P. A.) کے سپرد کردیتے ہیں ۔

پی۔ اے۔ تمام کاروبار کو انجام دیتے رہتے ہیں اس لئے کلکٹر صاحب کو نامنل (nominal) طور پر پریسڈنٹ بنایا جائے تو ہاں آفیشل ممبر کو وائس پریسڈنٹ بنایا جائے۔ سکریٹری کے چونکہ معلومات اچھے ہیں اسلئے ان کو سکریٹری رکھکر ڈسٹرکٹ کونسل کے نام سے چلایا جائے تو مناسب ہوگا۔ یہ بل بہت زمانہ کے بعد آتا ہے۔ خوش نصیبی ہے اس ڈسٹرکٹ بورڈ کی جو عمل میں آرہا ہے۔ خدا حافظ۔

మిస్టర్ స్పీకర్  11-45 నుంచి 12-15 వరకు శ్రీ సుందరయ్యగారు మాట్లాడతారు 12-15 నుంచి 12-45 వరకు మంత్రిగారు మాట్లాడతారు ఆపైన 15 నిముషాలలో సవరణలపై వోటు తీసుకుంటాను ప్రతి గౌరవ సభ్యులు అయిదేసి నిముషాల చొప్పున మాట్లాడితే ఇంకో ఇద్దరో ముగ్గురో మాట్లాడవచ్చు

శ్రీ పి. సుందరయ్య  ఇంకా శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు మాట్లాడలేదు ఆయన కూడా సాధారణ చర్చలో పాల్గొనాలి

మిస్టర్ స్పీకర్  తలో అయిదేసి నిముషాల చొప్పున మాట్లాడితే ఇంకో నలుగురికి అవకాశం యివ్వవచ్చు శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు ఆ విధంగా మాట్లాడతారా ?

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య  క్షమించండి అయిదు నిముషాలలో నేను మాట్లాడేది యేమీ లేదు కనుక మాట్లాడను

శ్రీ పి. సుందరయ్య  అధ్యక్షా, ఇప్పుడు వారికి అవకాశం యివ్వండి సమయాన్నిబట్టి ప్రతిపక్షంనుంచి యింకెవ్వరినీ పిలువవలసిన అవసరం లేక పోవచ్చు. కొంతమంది 3 నిముషాలలో ముగించేవారుంటారు కొంతమంది అయిదు నిముషాలలో ముగించవచ్చు.

మిస్టర్ స్పీకర్ . శ్రీ గోపాలకృష్ణయ్యగారికి సరిగా 10 నిముషాలు యిస్తాను.

*శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య . మీరు 10 నిముషాలు యిచ్చారు కనుక మాట్లాడుతున్నాను. అధ్యక్షా, జిల్లాబోర్డులను రద్దుచేయడం అనేది

మనకు ఒక జాడ్యం అయిపోయింది ఈ జాడ్యం శ్రీ రాజగోపాలాచారిగారి దగ్గర ప్రారంభంఅయినది అది ఆంధ్రరాష్ట్రానికి వచ్చేటప్పటికల్లా అసలు యేమిచేయడం అనే ప్రశ్నతోటి శ్రీ తిమ్మారెడ్డిగారు మంత్రిగా వుండగా, "Adult franchise ఎత్తివేస్తే బాగావుంటుందేమో ? అందుచేత దాని సంగతి తేలేవరకూ మేము ఎన్నికలను postpone చేస్తున్నాం" అని అప్పుడు చెప్పారు మళ్లా యీ మధ్యకాలంలో, "విశాలాంధ్ర వస్తుందికనుక postpone చేస్తున్నాం" అన్నారు విశాలాంధ్ర వచ్చిన తరువాత, "ఏమిచేయడం ?" అనే సమస్యలో తటపటాయించి మద్రాసు ప్రభుత్వ మంత్రిగారి యొక్క ఆదేశం ప్రకారంగా Block Boards పెడితే బాగుంటుందని అనుకొన్నారు అదీ కాకుండా యింతలోకి మెహతాగారి నివేదిక రాగానే

సాంఘిక సంక్షేమశాఖామంత్రి (శ్రీ డి సంజీవయ్య) మద్రాసుప్రభుత్వం ఆదేశాలు యీ ప్రభుత్వాని కివ్వలేదు

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య వారు ఇవ్వకపోతే నేను తమకు చదివి విని పిస్తాను ముఖ్యమంత్రిగారు ఒక ప్రకటన యిచ్చారు "మన స్థానికశాఖామంత్రి గారు ఎట్లాచేస్తే బాగావుంటుందోనని మద్రాసు ప్రభుత్వంతో మాట్లాడడానికి వెళ్ళారు" అని చెప్పారు స్థానిక శాఖామంత్రిగారు నెల్లూరులో దిగి, "వీటిని Block Board లుగా అక్కడపెట్టే వుద్దేశ్యం బాగానే వుంది అదే మేముకూడ అమలుజరుపబోతున్నాం" అని చెప్పారు ఆ తరువాత మెహతాగారి రిపోర్టు వచ్చింది

మిస్టర్ స్పీకర్ దానివల్ల సందేశాలు యివ్వడం కాదు Consultation చేయవచ్చు. సలహాలు యివ్వడంలో తప్పేమీలేదు ఆ విధంగా మాట్లాడకుండా 'ఆదేశం' అనకుండా సరిగా మాట్లాడండి

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య : 'సందేశం' అంటా

శ్రీ డి సంజీవయ్య : మేఘసందేశమా ?

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య . మేఘసందేశం కాదండి. మనిషిసందేశం 'సలహా' అనమంటే అంటాను.

మిస్టర్ స్పీకర్  వారూ వీరూ ఆలోచించుకున్నట్లు...

శ్రీ డి సంజీవయ్య  సంప్రదింపులు మంచిమాట—

మిస్టర్ స్పీకర్  సరే కుడుతున్నకొద్దీబాగుండదు please don't sting

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య  అందువల్ల అది జరిగిపోయిన తరువాత మెహతాగారి రిపోర్టు చాలా అనువుగా దొరికింది  జిల్లాబోర్డులను ఎత్తి పార వేయడానికి ముఖ్యంగా ఉపయోగపడింది ఈజిల్లాబోర్డుల పరిస్థితిమీద ప్రభుత్వం శ్వేతపత్రం (white paper) యిచ్చారు  తెలంగాణాగురించి ఒకమాట చెప్పి తక్కిన జిల్లాబోర్డులసంగతికి వస్తాను  ఆఖరుమాటలో "The District Boards in Telengana will continue as they are for the present, subject of course to the changes envisaged in the fore-going paragraphs" అన్నారు. అదికూడా చెప్పివుంటే యీ జిల్లాబోర్డులు ఎట్లా వుండేవో మేము అర్థం చేసుకుని వుండేవాళ్ళం. ఇప్పటికీ nominated జిల్లాబోర్డులు మాత్రమే వున్నాయి ఈ లోపల తెలంగాణాలో యేమిమార్పులు తీసుకువస్తారో దీనిలో చెప్పలేదు. వీటిలో చెప్పిన సూచనలమేరకు దాంట్లోమార్పుచేసి subject గా యిది నడుపుతాము అన్నారు  అది తెలుసుకోవలసిన అవసరం వుంది  ఇది ఈ శాఖ మంత్రిగారు జవాబులో చెబుతారేమో  ఈ జిల్లాబోర్డులు, యిందాక శ్రీ కల్లూరు సుబ్బారావుగారు సెలవిచ్చినట్లు, స్పెషల్ ఆఫీసర్లు ఏకఛత్రాధిపత్యంక్రింద నడుస్తున్నాయి  ప్రజాభిప్రాయం అనేది వాళ్ళకు తెలియదు, వాళ్ళకు అవసరంలేదు జిల్లాకలెక్టర్లు తాము యేమీ పరిపాలించలేని స్థితిలో భారం యెక్కువయిపోయి "ఇవి మనమీద ఎందుకుపడ్డాయి బాబూ ?" అని అనుకుంటున్నారు. ఆ స్థితిలో P A లు తప్పితే యింకెవ్వరూ administration నడపడంలేదు  నేను ఏ ఒక్కరిద్దరు P As గురించి చెప్పడంకాదు  అసలు system of P As చాలా భారం అయిపోయినది  అయనదే సర్వాధికారం అవుతున్నది  అందువల్ల people's element యేమయినా వుందా అంటే లేకుండా వచ్చింది  దీనిని First Five Year Plan లో ఖచ్చితంగా చెప్పారు 'Page 139 of First Five Year Plan' నుంచి చదువుతున్నాను

"The Constitution has provided for democratic institutions at the centre and in the States, but so long as local self-governing institutions are not conceived as part of the same organic constitutional and administrative frame work, the structure of democratic government will remain incomplete," అని వుంది. అందువల్ల యీనాడు మేము

తీసుకోబోయే బోర్డులలో 3 రకాలుగా Councils వున్నాయని చెప్పారు మెహతాకమిటీవారిని Councils క్రిందే చెప్పారు కావాలంటే ఎప్పటికయినా పేరు మార్చుకోవచ్చునన్నారు మనవాళ్లు Councils అని పేరుపెడతాం అన్నారు. ఏ పేరు పెట్టినా ఒకటే ఏ రాయి పెట్టి కొట్టినా రాలేవి ఒకటే వీటికి వున్న అధికారాలు యేమిటి? "ఇదివరకు జిల్లా బోర్డులకు డబ్బు తక్కువగా వుంది కనుక అధికారాలు తక్కువగా వున్నాయి కనుక, వసూలు చేసుకొనే అవకాశాలు లేవు కనుక రాష్ట్రప్రభుత్వమే డబ్బు యివ్వాలి కనుక అది లాభంలేదని మేము వాటిని ఎత్తేస్తున్నాం" అని చెప్పారు ప్రప్రథమంనుంచీ కూడా మేము "Tax లోంచి పంచాయతీ బోర్డులకు ఎక్కువగా డబ్బుయిచ్చే పద్ధతి ఆలోచించండి, జిల్లా బోర్డులకు డబ్బు యిచ్చే పద్ధతి ఆలోచించండి" అని కోరాము "ఇప్పుడు Block Boards వచ్చాయి వీటి పరిపాలనలో కొంత మార్పు చేయడానికి తీసుకువచ్చాము ఇప్పుడు అచ్చంగా nominations తోనే వుంది పంచాయతీలనుండి దీనికి election చేస్తాం" అంటారా అది వేరేసమస్య. దీనిలోకి రానేరాదు అది Block Development కు సంబంధించినది కాని జిల్లా పరిపాలనా విధానానికి వారు క్రొత్త సూచనలు చెప్పారు అవి అమలు జరుపబోతున్నాం అని చెప్పారు ఈ పరిషత్తుకు జిల్లాకలెక్టరు అధ్యక్షుడుగానూ ఆయన క్రింది వుద్యోగి కార్యదర్శిగానూ వుంటారని మెహతాకమిటీ రిపోర్టు చెబుతున్నది మెహతాకమిటీ రిపోర్టులో చెప్పిన రెండూ ఒప్పుకుంటున్నారా? వారు "రాష్ట్రప్రభుత్వాలకు వచ్చే ఆదాయంలో సగము వంతు revenue యీ పంచాయతీలకు, Block Boards కు యివ్వండి" అని చెప్పారు అది మనం యిదివరకే చేసినట్లయితే అసలు పంచాయతీలు starve కావడం గాని జిల్లా బోర్డులు starve కావడం గాని జరిగేదికాదు. వారికిచ్చినట్టి అధికారాలు యేమిటి? పంచాయతీ బోర్డులకు schools వగైరా యిస్తున్నాం అన్నారు "Discretionary funds include planting and preservation of trees on road margins, opening and maintenance of elementary schools, reading rooms, public markets, cart stands, slaughter houses, dispensaries maternity and child welfare centres and control of fairs and festivals." అని చెప్పారు అన్నిటికన్నా, "దీంట్లో hospitals పెడితే డబ్బేమీ వుండడంలేదు కనుక పెట్టడానికి వీలులేదు కనుక provincialize చేస్తున్నాం" అన్నారు. First Five Year Plan లో "రాష్ట్రప్రభుత్వాలకే డబ్బు వున్నట్లయితే అన్ని అధికారాలను వాళ్లు తీసుకోడానికి ప్రయత్నించాలి" అని వుంది. Time యిస్తే First Five Year Plan నుండి చదువుతాను

మిస్టర్ స్పీకర్ : ఏమి చదివినా ఆ 10 నిముషాలలోనే

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య అందువల్ల వారికున్న అధికారాలు తీసుకున్నారు రోడ్లు తీసుకున్నామని చెప్పి మళ్ళీ రోడ్లు వీరికి యివ్వబోతున్నారు జిల్లాకు సంబంధించిన రోడ్లు జిల్లా కౌన్సిలుకు వస్తాయి పంచాయితీ area కు మించినరోడ్లు Block development areaకు వస్తున్నాయి వీటిని నిర్వహించడానికి డబ్బు ఎక్కడుందనే సమస్య ప్రభుత్వంయెదుట పెడుతున్నాను దీనికి డబ్బును ప్రొవైడ్ చేయటానికి ప్రభుత్వం అంగీకరించిందా? అది యేమీ చెప్పకుండా యిదిమాత్రం postpone చేయడానికి ప్రధానంగా తీసుకువచ్చారు 'ఆపద గడవంబెట్టు' అని తిక్కనగారు చెప్పినపద్ధతిని యీనాడు వచ్చిన 'వెంటనే elections పెట్టాలి' అనే ఆపదను నెట్టివేయడానికే ఉపయోగపడుతుందిగాని యింకెందుకూ ఉపయోగపడదు వీటి constitution చూసినట్లయితే district level లో council పెడుతున్నాం' అంటారు మెహతాగారి సూచనలను అంగీకరించినట్లయితే ఆఫీసర్లంతా vote యిచ్చే అధికారంగల శాసనసభ్యులతోపాటు సభ్యులౌతారు అంతేకాకుండా Blocksను supersede చేయడానికిగాని, Blocks మార్చడానికిగాని, Blocks budget ను ఒప్పుకోవడం, ఒప్పుకోకపోవడంగాని నిర్ణయించుటలో జిల్లా Council కి అధికారంవుందా? Block Boards autonomous Boards కాదు పంచాయతీలను రద్దుచేయడానికి సర్వాధికారాలువున్నాయి దాని పరిపాలన ఈరోజు ఏకఛత్రాధిపత్యం జరుపుతున్న Inspector of Local Boards ను decentralization పేరుతో తీసేసి మళ్ళీ అధికారుల చేతులలోనే అధికారాన్ని centralise చేయడానికి ఉపక్రమిస్తున్నారు ఇది decentralization కు ఎంతమాత్రం ఉపయోగపడడంలేదు Finances కు సంబంధించిన provision స్పష్టంగా లేదు అధ్యక్షా time ఎంతుందో చెబితే దానినిబట్టి మాట్లాడుతాను

మిస్టర్ స్పీకర్ 5 నిముషా లుంది

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య . "అధికార వికేంద్రీకరణ చేస్తున్నాం" అంటున్నారు పంచాయతీలను రద్దుచేయడానికి అధికారం తీసుకుని, అవసరమయితే Block Board లను రద్దుచేయడానికి అధికారం తీసుకుంటున్నారు.

శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి · అధ్యక్షా, ప్రభుత్వం జారీచేసిన శ్వేతపత్రం (white paper) పైన, బిల్లుపైన మాట్లాడితే బాగుంటుంది మెహతాకమిటీ యిదివరకు చేసిన సిఫార్సులసంగతి, పత్రికలలో వచ్చినసంగతి మాట్లాడేకంటే మేము యిచ్చిన దానిసంగతి గురించి సభ్యులు మాట్లాడితే బాగుంటుందని మనవి చేస్తున్నాను

మిస్టర్ స్పీకర్ నేనుకూడ అదే అభిప్రాయపడుతున్నాను రాబోయే structure గురించి చాలా time తీసుకుంటున్నారు నేను general గా restrict చేయడంలేదుగాని, వీలయినంతవరకూ బిల్లుమీదే మాట్లాడాలి

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య మెహతా కమిటి రిపోర్టు వచ్చింది కనుక, దానిని పరిశీలించి అమలు జరపటానికి మాకు కొంత time కావాలి కనుక జిల్లాబోర్డు బదులు మరే పద్ధతి అమలుజరుపాలో ఆలోచించుకొనేందుకు అవకాశం కావాలికనుక postpone చేస్తున్నామని వారు చెప్పారు మెహతా కమిటిరిపోర్టేమిటో దానివల్లవచ్చే పరిణామాలుఏమిటో తరువాత చర్చించుకో వచ్చు ముందు జిల్లాబోర్డులు వుంచటమా ? లేదా అనే విషయం ఆలోచించి నపుడుజిల్లాబోర్డులు వుండాలి, ఆఫీసర్ల నిరంకుశపాలన పోవాలి, ప్రజలయొక్క democratic opinion నిలవాలి అని నేను చెప్పటంలో తప్పులేదు కాని ఆ విషయమును objects and reasons లో ఎక్కడా mention చేయలేదు. మంత్రి గారు మెహతాకమిటి గురించి మాట్లాడివుండకపోతే నేనుకూడా మాట్లాడే వాడిని కాను మంత్రిగారు దానిమీద ఆధారపడుతున్నారు కాబట్టి రాబోయే జిల్లా పరిపాలనా సంస్కరణలన్నీ దానిమీదే ఆధారపడివున్నాయి కాబట్టి నేను కూడా ఆ రిపోర్టునే mention చేస్తున్నాను. అధ్యక్షా, అది rule out చేస్తామని మీరు అంటే నేను దానిని వదలి యింకో subject కు వెడతాను

*Mr Speaker* So long as it is not unparliamentary or indecent, I give lot of latitude to the hon Members They must go on with full freedom

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య అధ్యక్షా, నేను irrelevent గా మాట్లాడటంలేదనే తమకు మనవిచేస్తున్నాను ఇప్పుడు వున్న ఆఫీసర్ల పని ఈ విధంగానే కొనసాగవలెనా మరోమార్గం ఏదీలేదా అంటే, 6 నెలలలోగా కొత్తపద్ధతిని ఆలోచిస్తామని, దానిని అమలుపర్చటానికి కొంత time కావాలని వారు చెబుతున్నారు. ఈనాడు దేశం మొత్తంమీద బ్లాకులు ఎక్కడా లేవు గ్రామ మొత్తమున పంచాయతీలు లేవు. పంచాయతీలు ఏర్పడితేనే బ్లాక్ లెవెల్‌లో కమిటీలు ఏర్పడుతాయి. దేశం మొత్తంమీద బ్లాకులు ఏర్పడితే జిల్లాబోర్డులు ఏర్పడతాయి. Constituency ప్రకారం ఎసెంబ్లి మెంబర్ Block Board కు అధ్యక్షుడుగా ఏర్పాటుచేయటానికి వీలులేకుండాపోతున్నది జిల్లా మొత్తంమీద పంచాయతీలు బ్లాక్‌బోర్డులు, జిల్లా కౌన్సిల్స్ ఈ మూడిం టిని అమలుజరుపుతామని వారు చెప్పారు. అది ఏ విధముగా చేయబోతున్నారో

మాకుగాని, మీకుగాని వారు చెప్పలేదు ఈనాడు జిల్లా బోర్డులను extend చేస్తామంటే decentralization పేరులో Centralization ను ప్రజాస్వామికం పేరులో ప్రజాస్వామిక రహితమైన పద్ధతిని నడుపుతున్నారు మనమంతా elect అయినవారమేనని శ్రీ సాగి సూర్యనారాయణరాజుగారు చెప్పారు అదే విషయం గురించి జవహర్‌లాల్ నెహ్రూ 'మనమంతా ఎన్నిక అయ్యాము కాబట్టి యిక ఎన్నికలు అక్కరలేదు అని చెప్పే మనస్తత్వం సరైనది కాదని' చెప్పారు

"Local Self Government is and must be the basis of the true system of democracy We have got rather into the habit of thinking that democracy should be at the top and not below Democracy at the top will not be a success unless it is built on the foundations from below "

పంచాయితీలన్నీ ఆ foundation తో పెడతామంటే అది ఈ సంవత్సరములో జరగదు ఈ వేళ 5000 కంటే ఎక్కువ పంచాయితీలు లేవు జిల్లా కౌన్సిల్స్‌కుకాని, బ్లాక్ బోర్డులకుగాని indirect elections జరపటం న్యాయం కాదు అన్నిటికి direct elections వుండాలి శాసనసభ్యులుగా మనంవచ్చి ఇక ఎన్నికలు అక్కరలేదని చెబితే నూతనముగా వచ్చే యువకులకు ప్రజాస్వామ్యములో 'ట్రైనింగ్' అవకాశంలేకుండా చేసినవారమౌతాము అందువల్ల వారికి కావలసిన సహకారము ఇవ్వటానికి democratic system ప్రకారం direct elections నడపవలసిందిగా కోరుతూ సెలవు తీసుకొంటున్నాను

*శ్రీ ఎ బి. నాగేశ్వరరావు అధ్యక్షా! సభముందు ఈరోజువున్న ఈ సవరణబిల్లును బలపరుస్తు నాకువున్న కొన్ని అనుమానాలను clarify చేయవలసినదిగా మీ ద్వారా మంత్రిగారినికోరుతున్నాను. Andhra Pradesh Amendment Act 1957 అని short title లో వుంది తెలంగాణాకూడా కలిపే ఆంధ్ర ప్రదేశ్ అవుతుంది. కాని ఈ జిల్లాబోర్డు స్పెషల్ ఆఫీసర్లు ఆంధ్రరాష్ట్రానికి సంబంధించిన 11 జిల్లాలలోనే వున్నారు తెలంగాణాకు సంబంధించినంతవరకు 4, 5 సంవత్సరాలక్రిందట నామినేట్ చేయబడిన జిల్లాబోర్డులు మాత్రమే వున్నవి నాకు తెలిసినంతవరకు తెలంగాణాలోని జిల్లాబోర్డుల 'life' కు పరిమితిలేదు. 6, 8 నామినేటెడ్ మెంబర్సుతో జిల్లాబోర్డులు పనిచేస్తున్నాయి. జిల్లాబోర్డుల స్పెషల్ ఆఫీసర్ల 'life' ను 1958 డిశెంబరు 10 వ తేదీవరకు extend చేయటం అనేది ఆంధ్రలోని 11 జిల్లాలకే వర్తిస్తుందా లేక తెలంగాణా

జిల్లాలకు గూడా వర్తిస్తుందా ? లేక తెలంగాణాలోనివి అట్లాగే continue అవుతూ ఆంధ్రలోని 11 జిల్లాలలోనే special officers వుంటారా అనే విషయంలో మంత్రిగారు స్పష్టంగా చెప్పాలని కోరుతున్నాను కాని ఒక ప్రాంతంలో స్పెషల్ ఆఫీసర్లచేత, ఒకప్రాంతంలో నామినేటెడ్ మెంబర్లచేత ఈ జిల్లాబోర్డులను నడిపించటం బాగుండదని నేను అభిప్రాయ పడుతున్నాను ఏ ఫిబ్రవరిలోనో ఈ రెంటిని integrate చేయటానికి Act తీసుకురావటమో లేకపోతే అక్కడకూడా నామినేటెడ్ మెంబర్సును పెట్టి రెండు కలిపి ఒకేసారి మారిస్తే బాగుంటుందేమోననే విషయం ఆలోచించ వలసినదిగా ప్రభుత్వాన్ని కోరుతున్నాను ఈ రోజు ఇచ్చిన వైట్ పేపరుగురించి మాట్లాడవలెనంటే అందులో చాలా సమస్య లున్నవి బిల్లు వ్యవహారము చూచినపిదప దానిని చర్చించవచ్చునని భావిస్తున్నాను ముఖ్యంగా తెలంగాణా ఆంధ్రప్రాంతములలో వున్న వ్యత్యాసమును బాగుగా గుర్తించి, ఆలోచించి, ఈ బిల్లు పెడితే బాగుంటుందని ప్రభుత్వానికి మీ ద్వారా మనవిచేస్తూ సెలవు తీసుకొంటున్నాను

*శ్రీ ప్రగడ కోటయ్య (చీరాల) అధ్యక్షా ! మంత్రిగారు ప్రవేశపెట్టిన ఈ బిల్లును సమర్థిస్తూ నాలుగుమాటలు మాట్లాడదలచుకొన్నాను ప్రభుత్వం జిల్లాబోర్డులను రద్దుచేయాలనే నిర్ణయానికి వచ్చింది అది మంచిదా ? చెడ్డదా ? అనేదానికంటే దానిస్థానే ఏవో "బ్లాకు కౌన్సిల్స్" అని, "జిల్లా కౌన్సిల్స్" అని పెట్టే ఆలోచన ప్రభుత్వానికి వున్నట్లుగా తెలుస్తున్నది వారిచ్చిన సూచనల ప్రకారం చూస్తే బహుశా 5, 6 సంవత్సరాలవరకయినా ఈబ్లాక్ కౌన్సిళ్లు కాని, జిల్లా కౌన్సిళ్ళుకాని పూర్తిగా ఏర్పడటానికి అవకాశం లేదు రాష్ట్రం మొత్తంమీద 42% అంటే సగానికి తక్కువగానే N E S బ్లాకులు వున్నవి ద్వితీయ ప్రణాళిక అంతానికి అంటే 1961 చివరకు రాష్ట్రమంతటా బ్లాకులు ఏర్పడే అవకాశంకూడా లేదని ప్లానింగుమంత్రిగారు స్పష్టముగా చెప్పారు రాష్ట్రం మొత్తంమీద ఈబ్లాకులను ప్రవేశపెట్టటానికి మరో మూడుసంవత్సరాలయినా పట్టవచ్చునని వారుచెప్పారు ప్రభుత్వం ఈ బిల్లును ప్రవేశపెట్టి శాసన సభ్యుల అంగీకారము పొందినప్పటికి వారు వూహించిన రీతిగా ఈ బ్లాక్ కౌన్సిల్స్ ఏర్పడటానికి అవకాశము వుండదు. జిల్లా కౌన్సిల్స్‌గురించి వారు స్పష్టముగా చెప్పలేదు కాని ఈ జిల్లాకౌన్సిల్స్‌కు జిల్లాకలెక్టరు అధ్యక్షుడుగాను ఆయన సిబ్బంది ఆయనకు సహాయకారులుగాను వుంటారని వుంది ఇన్ని సంవత్సరాల అనుభవంమీద కలుగుతున్న అభిప్రాయ మేమంటే ఏ ప్రాంతానికి వెళ్ళి చూచినా పరిపాలనలో తగినంత సామర్థ్యం లేనిది ఏదని విచారిస్తే జిల్లా బోర్డు అనేది చరాసరి గుర్తుకువస్తుంది

గండ్లు, గుంటలు పడిపోయి, మనుషులు నడవడానికి కూడా అవకాశం లేని రోడ్లు ఏవి అంటే జిల్లాబోర్డు రోడ్లు అని తెలుస్తుంది Education కు సంబంధించి D E Os ఉన్నారు, Inspectors ఉన్నారు జిల్లా బోర్డుకు ఒక పంతులును transfer చేయాలంటే ఆ అధికారం D E Os కు, Inspectors కు తప్ప, జిల్లా బోర్డులకు అటువంటి అధికారం ఏమీలేదు ఈ వేళ మన జిల్లాబోర్డులు నిర్వహించేవి మూడు విధులున్నాయి Education, Public Health, Highways ఈ మూడింటినీ జిల్లాబోర్డు సమర్థంగా నిర్వహించడానికి అవకాశం లేదన్న విషయం ప్రభుత్వం గుర్తించింది అందుకు తగిన ఆర్థిక వసతి లేదన్న విషయం స్పష్టంగా చెబుతున్నారు ఈ పరిస్థితులలో పై మూడు శాఖలను కూడ సమర్థంగా నిర్వహించాలంటే, Superfluous bodies అన్నీ ఏర్పరచి, ఎందుకూ కొరగాని పరిపాలనాధికారం సాగించడానికి ప్రయత్నం చేయడం కంటె విద్యాలయాలను Education Department కు అప్పజెప్పి, District Board Highways ను Highways Department కు అప్పచెప్పి, Public Health ను Health Department కూ అప్పజెప్పి, మిగిలిన విషయాలతో కలెక్టరు సరాసరిగా పరిపాలన సాగించినట్లయితే ఏమైనా సమర్థంగా సాగుతుందేమో అనేది ప్రభుత్వంవారు పరిశీలనచేస్తే బాగుంటుందని మనవి చేస్తున్నాను అంతేకాని తిరిగి లేజిస్లేటర్సును చేర్చడం, M Ps ను చేర్చడం, Block Councils లో budget లను పరిశీలన చేయడం, పరిపాలించడం, supervise చేయడం, co-ordinate చేయడం... ఈ పదజాలమంతా బ్రహ్మాండంగా ఉన్నదికాని వాస్తవిక పరిస్థితులలో ఏవిధముగా co-ordinate చేయాలో, ఏ విధముగా supervise చేయాలో ఏ విధంగా బడ్జెటును పరిశీలన చేయాలో... ఇవన్నీ మన ముందు పెట్టబడిన white paper లో ఎక్కడాకూడ స్పష్టంగాలేదు మనం ఊహించే చిత్రాన్ని 6 సంవత్సరాల అనంతరంకాని మనం చూడడానికి అవకాశాలు లేవు కేవలం మనం చేస్తున్న సూచనలమీదనే ప్రభుత్వం ఆధారపడడంలేదు ఉన్నంతలో సర్దుబాటుగా, సమర్థవంతంగా పరిపాలనను నిర్వహించడానికి ఒక నిర్ణయానికి రావడం సంభవించింది కాబట్టి ఈ మూడుశాఖలనూ కూడ ప్రభుత్వమే తీసుకొని అభివృద్ధి అంటే ప్లానింగు కార్యక్రమాన్ని జరుపుటకు త్వరలో ఒక Statutory Block Council ను ఏర్పాటుచేసి, అభివృద్ధి కార్యక్రమాలను సాగించినట్లయితే, ఎంతో బాగుంటుందని తెలియజేస్తూ నేను సెలవు తీసుకొంటున్నాను

శ్రీ యం. సత్యనారాయణరాజు (చీపురుపల్లి - జనరల్) : అధ్యక్షా, జిల్లా బోర్డు ఎన్నికలు పోడిగించి, special officers యొక్క పదవికాలాన్ని మరొక

సంవత్సరం పొడిగించేందుకు తెచ్చిన బిల్లును మేము వ్యతిరేకిస్తున్నాము దీనికి ఒక white paper అంటూ publish చేసి, మా Opinion యివ్వాలని కోరారు ఇప్పుడు జిల్లాబోర్డులు సరిగా పనిచేయడంలేదని, అవి వుండడంవల్ల ప్రయోజనం ఏమీలేదని చెప్పారు అది చాలా ఆశ్చర్యకరమైన విషయం జిల్లాబోర్డులు బ్రిటిష్ ప్రభుత్వ కాలంలో ఏవిధంగా పనిచేశాయో మనందరకూ తెలుసును బ్రిడ్జిలు, నూటికి 80 నుంచి 90 వరకూ రోడ్లుకూడా జిల్లాబోర్డులే వేయిస్తూండేవి అప్పుడు ప్రసిడెంట్సుగా మనవారు ఉంటూండేవారు కాని మనకు స్వరాజ్యంవచ్చిన తరువాత ప్రజలచే ఎన్నుకొనబడిన ప్రజాస్వామ్యమును నిలబెట్టుకుందామనుకున్నప్పుడు జిల్లాబోర్డులు యింత అధ్వాన్నంగా, నామమాత్రంగా తయారయాయంటే దీనికి మన ప్రభుత్వమే కారణం జిల్లాబోర్డులు ఎందువల్ల సరిగా పనిచేయుటలేదు, వాటికి కావలసిన ధనం, అధికారం ఎందుకు ఇవ్వడంలేదు? ఇస్తే ఎందుకు పనిచేయవు? అనేది ఆలోచించడంలేదు జిల్లాబోర్డులు అవస్థలలో ఉన్నాయనీ, అవి ఎక్కువడబ్బు దుబారా చేస్తున్నాయనే సాకు చూపించి వాటికి అధికారం యివ్వడంలేదు ప్రస్తుతం మంత్రిగా ఉన్నవారు జిల్లాబోర్డు ప్రసిడెంటుగా వుండేటప్పుడు అధికారం ఉండడమేమి? ఇప్పుడు అధికారంలేకుండా ఉండడమేమి? అప్పుడు ఉండేవిధంగా ఆర్థికస్థోమత కలుగజేయకపోవడంవల్ల జిల్లాబోర్డులు నామమాత్రంగా తయారైనాయి కాని వేరే ఇంకొక కారణమేమీలేదు పంచాయతీబోర్డులకు హెచ్చు అధికారాన్నిచ్చి, ఆర్థికస్థోమత కలుగజేసి ప్రజాస్వామ్యాన్ని నిలబెడదామని చూస్తున్నారు ప్రస్తుతం పంచాయతీ బోర్డుల ఎన్నికలు ఏ రీతిగా జరుగుతున్నాయి, ఎన్ని అవకతవకలు జరుగుతున్నాయి అనే దానిని పునాదిగా పెట్టుకొని, దాంట్లోంచి indirect elections ద్వారా councils ను ఏర్పాటుచేసి, ఆ కౌన్సిల్సుమీద మరొక జిల్లా కౌన్సిలును build up చేస్తే ఇసుకదిబ్బలమీద వేసిన పునాది ఎంత కాలం నిలబడుతుందో, యిది అంతవరకే నిలబడుతుందని అందరికీ తెలుసు ఇది ఎంతమాత్రము పనిచేయదు కాబట్టి ఏదోసాకుతో జిల్లాబోర్డులను ఎత్తివేయడం మంచిదికాదు ఇది ప్రజాస్వామ్యాన్ని మంటకలపడానికే పనికివస్తున్నది సరిగా పనిచేయదు. కాబట్టి జిల్లాబోర్డులకు పూర్వంవలెనే తగిన ఆర్థికస్థోమత, అధికారం యిచ్చి పనిచేయించినట్లయితే ప్రజాస్వామికం నిలబెట్టడానికి అవకాశం ఉంటుంది కాబట్టి ఆ ప్రకారం చేయాలని కోరుతున్నాను

[*Sri K. Vijaya Bhaskara Reddi in the Chair*]

మేము ఎన్నోమారులు జిల్లా ప్లానింగ్ కమిటీలద్వారా ఫలాన పనులు జరిపించాలని resolutions చేసినప్పటికికూడ ఆ పనులేమీ జరుగుటలేదు ఇటు

వంటి పరిస్థితులలో జిల్లా కౌన్సిల్సుద్వారా, Block councils ద్వారా పనులు అవుతాయనుకోడం పొరపాటే. పనులేమీ జరుగవు.

స్పెషల్ ఆఫీసరుల పరిపాలన ఎలాఉందో కొంతమంది సభ్యులు మనవి చేశారు వారు సరిగా పరిపాలన చేయకపోవటానికి రెండు కారణాలున్నాయి అన్నారు ఒకటి నిరంకుశత్వం అన్నారు అయితే కావచ్చును ఆయనకు responsibility జాస్తిగా ఉండటంవల్ల ఆయన చేయలేకపోవచ్చు రెవిన్యూకు సంబంధించిన పనులు, జిల్లా ప్లానింగుకు సంబంధించిన విషయాలు అన్నీ ఆయన నెత్తిమీద రుద్దడంవల్ల చేయలేకపోవచ్చు ప్రతి పనీ వారి P. A ల ద్వారానే జరగాలి దీనికి జిల్లా కలక్టరు ఎంతమాత్రం బాధ్యుడుకాడు ఆయనకు అవ కాశం ఉన్నంతవరకూ అధికారం యిచ్చి, బాధ్యతలనిచ్చి పని చేయడంలేదని ఆక్షేపిస్తే బాగుంటుంది కాని తలకుమించిన బాధ్యత యిచ్చి, లేనిపోనివన్నీ అప్పజెప్పి పరిపాలన బాగాలేదనీ, నిరంకుశత్వం అయిపోయిందనీ, మాట విని పించుకోవడం లేదనీ అనడం బాగాలేదు అందువల్ల ఈ స్పెషల్ ఆఫీసరుల కాలం పొడిగించకుండా, ఒక సోదరుడు చెప్పినట్లుగా ఫిబ్రవరి నెలవరకూ వుంచి, ఈ లోగా ఎన్నికలు జరిపి జిల్లాబోర్డు ప్రశిడెంటుకే తగిన అధికారాలు యిచ్చి బ్రిటిష్ గవర్నమెంటు కాలంలో జిల్లాబోర్డులు ఏవిధంగా ఉన్నాయో కనీసం ఆవిధంగా చేసినా మేము ప్రభుత్వాన్ని అభినందిస్తాము. కాబట్టి ఆ విధంగా చేయాలనీ, వెంటనే ఎన్నికలు జరపాలనీ మనవి చేస్తూ విరమిస్తున్నాను

* శ్రీ పి. సుందరయ్య. అధ్యక్షా, ఈ బిల్లును మేము వ్యతిరేకించక తప్పదు ఇది జిల్లాబోర్డులను రద్దుచేసే కార్యక్రమం తప్ప యింకొకటేమీ కాదు ఈ నాడు జిల్లాబోర్డులను రద్దుచేయడం అంటే స్థానిక స్వపరిపాలనా పద్ధతినే రద్దుచేయడం తప్ప యింకొకటి కానేకాదని నేను దృఢంగా చెప్పవలసి వస్తోంది మంత్రిగారు యిచ్చిన white paper లో జిల్లాబోర్డులను రద్దుచేస్తూ షాటి స్థానంలో వచ్చే పద్ధతినికూడా చెప్పారు. దీనిని గురించిన వివరాలలోనికి వెళ్ళడం యీ రెండు, మూడు గంటలలో ఎవ్వరికీ కూడా సాధ్యంకాదు. ఇప్పుడు నాకున్న అరగంటలో నాకుకూడా ఆ వివరాలలోనికి వెళ్ళడం సాధ్యంగాదు రాబోయే స్థానిక స్వపరిపాలనయొక్క రూపాన్ని లోతుగా చూడాలంటే యీ శాసనసభా వేదికమీద అయితే కనీసం 4, 5 రోజులైనా పడుతుంది. ఆ విషయాలన్నీ మనం పరిశీలించడం అవసరం కాబట్టి, white paper లో సూచించిన రూపం ఏ రకంగా వుంటుందో పరిశీలించి తగు సూచన

లివ్వడానికి శాసన సభ్యులతో ఒక కమిటీని ఏర్పాటుచేస్తే బాగుంటుంది దీంట్లో సూచించిన రీతిగా జిల్లాబోర్డులను రద్దుచేసి ఆ స్థానంలో యింకొకటి ఏర్పాటు చేస్తామనే ప్రాతిపదికమీద .స్థానిక స్వపరిపాలన రూపం మారింది. నామ మాత్రం అయిపోయింది నామమాత్రమేకాదు, క్రిందనుంచి పైవరకూ కూడా స్థానిక స్వపరిపాలన అనేది రద్దు అయిపోయి, కేవలం ఉద్యోగస్థుల పరిపాలన వలె ఉంటుంది Block councils కు, District councils కూ ఒక ప్రక్కన అధికారాలు యిస్తామంటున్నారు కాని ఆచరణలో అట్లా కాకుండా కేవలం ఉద్యోగస్థుల పరిపాలన క్రిందనే ఉంటుందని యిప్పుడు చెప్పిన దానినిబట్టి కనబడుతోంది

ఈ white paper లో నాలుగవ పేజీలో ఈ విధంగా చెప్తున్నారు

" ... . by stages, determined in advance, democratic bodies might take over the general administration of taluks and districts, excluding such functions as the maintenance of law and order, administration of justice and certain functions relating to revenue administration .. "

ఏదో Law and Order, కు సంబంధించిన, courts కు సంబంధించిన వ్యవహారాలు, Revenue కు సంబంధించిన కొన్ని వ్యవహారాలలో తప్ప ఇతర పనులు తాలూకా level లో, జిల్లా level లో ప్రజాస్వామికంగా ఎన్నుకో బడిన సంస్థల ద్వారానే నడపాలని, రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలోనే వాటిని పూర్తి చేయాలని ఆ ప్రణాళికలోనే సూచించారని కూడా యిందులో చెప్పడం జరిగింది ఈ సూచించబడిన మార్పు, అనగా జిల్లా కౌన్సిల్స్ కాని, బ్లాక్ కౌన్సిల్స్ కాని, 3 ఏళ్ళలోపుగా, అనగా రెండవ పంచవర్ష ప్రణాళిక పూర్తి అయేలోపుగా వచ్చే అవకాశం ఏమైనా ఉందా అంటే ఏమాత్రం లేదు ఒకప్రక్క "జిల్లాబోర్డులు నిరుపయోగమైనవి, అందుచేత వాటిని రద్దుచేసి కొత్తపథకం తెస్తున్నాము" అంటున్నారు ఎందువల్ల జిల్లాబోర్డులు నిరుప యోగమైనాయి ? జిల్లాబోర్డులు చాలా విస్తృతమైనటువంటి ప్రాంతాన్ని చూడాలి, కాబట్టి అవి నిరుపయోగం, అన్నారు దానికి కారణం ఏమిటి? జిల్లా కౌన్సిల్స్‌కు కూడా జిల్లా స్థాయిలో Police అధికారాలు, Court అధి కారాలు తప్ప, మిగతా విషయాల్లో సర్వాధికారాలు యిస్తామని చెప్పడమే కాకుండా.

" ....... The State Government will in due course devolve on the District Councils progressively the powers now exercised by the Government through the District Officers.. ... ." అని చెప్పడం జరిగింది

Collector, Educational Officer, Agricultural Officer Veterinery Officer, Medical Officer, తరువాత Irrigation Electricity శాఖల Engineers, మొదలైన వారిద్వారా ఈ రోజున ప్రభుత్వం ఏ ఏ పనులను నిర్వహిస్తూ ఉందో, ఆ అధికారాలన్నీ కూడా జిల్లాస్థాయిలో జిల్లాకౌన్సిల్స్‌కు యిస్తామంటున్నారు జిల్లాలను ఏమైనా మార్పు చేసే ఉద్దేశ్యం ఉందా ? అంటే ఇప్పుడు ఆ సూచనలు లేవు కాబట్టి జిల్లాలు జిల్లాలుగానే ఉంటాయా? జిల్లా చాల విస్తృతంగా ఉంది కాబట్టి స్థానిక స్వపరిపాలన అనేది నిరుపయోగమైపోయింది జిల్లాబోర్డులు నిరుపయోగమైనవని వీటిని రద్దు చేస్తున్నామంటున్నారు అందుచేత ఇపుడు ఈ జిల్లాలు జిల్లాలుగానే ఉన్నట్లయితే, ఈ జిల్లాల వైశాల్యం తగ్గించకపోతే ఈ జిల్లా కౌన్సిల్స్ మాత్రం సక్రమంగా సాగుతాయా ! జిల్లాలు విస్తృతమయి జిల్లాబోర్డులకు వాటిమీద అజ్మాయిషీ లేకపోయిందని చెబుతూ ఈ నాడు ప్రభుత్వం అంతకన్న ఎక్కువ అధికారాలను ఈ జిల్లా కౌన్సిల్స్‌కు యిస్తామని అంటున్నాడు, విస్తృతమైన వైశాల్యంగల ఈ జిల్లాలలో ఆ జిల్లా కౌన్సిల్స్ ద్వారా స్థానిక స్వపరిపాలన ఏరీతిగా జరుగుతుంది ? అనే విషయం ఆలోచించాలి జిల్లాబోర్డులు నిరుపయోగమై పోయాయి అనే దానికి, వాటిని రద్దు చేయడానికి కారణం విస్తృతమైన వైశాల్యంగల జిల్లాలలో జిల్లాబోర్డులు అధికారాలను చలాయించలేకపోబట్టి కాదు అది ఒక సాకుమాత్రమేతప్ప యింకొకటికాదు అని స్పష్టమౌతూ ఉంది ఈ రోజున 'ఆంధ్రప్రదేశ్‌లో 20 జిల్లాలున్నాయి. ఇవి ఎక్కువ వైశాల్యంగలవైతే వాటిని విభజించుకోవచ్చును తక్కువ జనాభా గలిగి 10 వేల చదరపుమైళ్ళు వైశాల్యం చొప్పున ఈ 20 జిల్లాలను 60 జిల్లాలుగా చేయండి లేకపోతే 70 జిల్లాలుగా చేయండి. జనాభా ఎక్కువగా ఉన్నచోట 3 లక్షలు, 5 లక్షలు, చొప్పున జనసాంద్రతను బట్టి జిల్లాలను విభజించండి వైశాల్యం పెద్దదిగా ఉంటే తగ్గించండి ఆ ప్రాంతాలలో అధికారాలను సక్రమంగా వినియోగించి పనిచేయ గల్గినటువంటి జనాభానుబట్టి ఈ జిల్లాలను తయారుచేసి, ఈ రోజు జిల్లా ఉద్యోగస్థులద్వారా ప్రభుత్వం కొనసాగిస్తున్నటువంటి పనులన్నిటినీ ఆ జిల్లా సంఘాలకు అప్పచెప్పడమనేది సక్రమమైన పద్ధతి. కాని జిల్లాబోర్డులను రద్దుచేయడం సరియైనదికాదు జిల్లాబోర్డులను సజీవంగా చేసేదానికి మార్గం ఏమిటి ? అంటే, యిపుడు జిల్లాలకున్న ఎక్కువ వైశాల్యమును తగ్గించి జిల్లాలలో ఉద్యోగస్థుల పరిపాలనను తీసివేసి, ఆ ఉద్యోగస్థులందరూ కూడా ఆ జిల్లాస్థాయిలో ప్రజలచేత సరాసరి ఎన్నుకోబడిన ప్రజాప్రతినిధులు చేసిన తీర్మానముల ప్రకారం, వారు చేసిన నిర్ణయాలను అమలు జరిపేరీతిగా మనం చట్టాన్ని సవరించినపుడే జిల్లాబోర్డులు సక్రమంగా పని

చేస్తాయి అంటే అసెంబ్లీలో మనం చేసిన తీర్మానాలన్నీ ప్రభుత్వంమీద binding అయి, ప్రభుత్వ నిర్ణయాలనన్నిటినీ, ఇక్కడ మంత్రులుచేసిన తీర్మానాలు, secretaries ఏ విధంగా అమలు జరుపుతున్నారో, ఆ తీర్మానాలనన్నిటిని majority party చేయవచ్చుననుకోండి అది వేరేసంగతి అదేరకంగా జిల్లా స్థాయిలో ప్రజలచేత ఎన్నుకోబడిన జిల్లాబోర్డులు కానివ్వండి, జిల్లా కౌన్సిల్సు కానివ్వండి, (ఆ పేరువిషయంలో నాకేమీ వివాదంలేదు, జిల్లాబోర్డు కాకపోతే జిల్లా కౌన్సిలు అనండి నాకేమీ అభ్యంతరం లేదు) అవి చేసిన నిర్ణయాలను execute చేయటానికి ముగ్గురో, అయిదుగురో సభ్యులు గల, Standing Committee ఇక్కడ cabinet లాగే జిల్లాస్థాయిలో ఒకచిన్న Executive Committee గా ఏర్పాటుచేసి వాళ్ళు చెప్పినరీతిగా, వారి నిర్ణయాలను స్థానికంగా ఉన్న ఉద్యోగస్థులు అమలుజరపవలసి ఉంటుంది అంతేకాని, ఈరోజు మునిసిపల్ కమిషనర్లు, పంచాయితీబోర్డు ఎక్జిక్యూటివ్ ఆఫీసర్సు, మునిసిపాలిటీవారు, పంచాయితీ బోర్డులవారు ఏమైనా తీర్మానాలుచేస్తే వాటిని అమలులో పెట్టకుండా అడ్డంకులు వేస్తున్నరీతిగా ఉండరాదు. ఆ విధంగా అడ్డంకులు వేసేదానికి వారికిహక్కులేదు అని స్పష్టంచేయాలి ఆరకంగా జిల్లాబోర్డులను పునర్నిర్మించ వలసినది పోనిచ్చి జిల్లాబోర్డులను రద్దుచేసి వానికన్న ప్రజలకు సన్నిహితంగా ఉండడం కోసమని Block councils తెస్తామంటున్నారు. ఈ Block councils కు మాత్రం 50 లేక 60 వేల ప్రజలచే సరాసరి ఎన్నుకోబడిన ప్రతినిధులతో సభలను పెట్టి ప్రజాతంత్రాన్ని తీసుకువస్తున్నామనే సూచన లేదు 2 వేల జనాభా కల్గినటువంటి గ్రామపంచాయితీల అధ్యక్షులతో Block council ఏర్పడుతుంది వీరు నలుగురు, లేక అయిదుగురు ఆల్డర్ మన్‌లను ఎన్నుకుంటారు 50 గ్రామాల పంచాయితీ అధ్యక్షులు అయిదుగురు ఆల్డర్ మన్‌లను ఎన్నుకోవడంప్రధానమైన విషయంకాదు వీళ్ళు ఒకమూల block council అధ్యక్షుని ఎన్నుకుంటారు. ఈ విధంగా ఇపుడు ఎన్నికలు ఎక్కడ జరుగుతున్నాయి ? ఇవి పరోక్ష ఎన్నికలంటారు ఇవి పరోక్షఎన్నికలు కావు పరోక్ష nominations అని నేను అంటున్నాను. ఈవిధంగా పరోక్షమైన ఎన్నికలు పెట్టటం కూడా పొరపాటవుతుంది అందుచేత సరాసరి ప్రజాస్వామికాన్ని మరింత సన్నిహితంగా తీసుకురావడానికి, వాళ్లకు కావలసిన కార్యక్రమాలను block level లో ఉండి చేసేదానికి వీలుంటుందని ఈ Block Councils కు ఎన్నికలు లేకుండా చేస్తున్నారు పంచాయితీలకు జరిగే ఎన్నికలలో అనేక అవకతవకలున్నాయి. గ్రామాలలో ఎన్నికలు చేతులు పైకెత్తే పద్ధతిలో ఉన్నాయి. చదువు రానటువంటివాళ్ళనుకూడా ఉద్యోగస్థుల ముందు ఎవరికిఓటు వేస్తావు అని అడిగే పద్ధతులవల్ల ఈ ఎన్నికలు రహస్యపద్ధతిన కాకుండా అర్థాంత

రంగా జరుగుతున్నాయి అందువల్ల గ్రామాలలో, పంచాయితీలలో, మునిసి పాలిటీలలో వార్డులను ఏర్పాటుచేయడం ద్వారా అధికారంలోఉన్న పార్టీవారు యిష్టంవచ్చినట్లు చేయడం జరుగుతూంది ఈవిధమైనటువంటి అవకతవకలు ఉన్నాయి రేపు రాబోయే Block Councils ఈ పంచాయితీ ఎన్నికలను కూడా నిరుపయోగం చేయబోతున్నాయి పంచాయితీలకు వచ్చిన డబ్బుతో గ్రామాల level లో వాళ్ళు ఏమేమి పనులు చేసుకోవాలో నిర్ణయించుకొనే హక్కు ఉన్నది కాని ఇపుడు గ్రామపంచాయితీలు ఆ విధంగా budget ను వేసుకుంటే ఆ budget ను Block Council ఆమోదించాలి, లేకుంటే వారు ఏమైనా మార్పులు చేసినట్లయితే ఆ మార్పులను గ్రామపంచాయితీలు అంగీకరించాలి అదేరీతిగా Block Councils కు అధికారాలు యివ్వబడుతున్నాయి ఈ విధంగా చేస్తే decentralisation of powers అవుతుంది అంటున్నారు గ్రామాలలో ఏమేమి పనులు కావాలో, వాటివాటి కోటాకు వచ్చిన డబ్బుయింత అని వాటిబడ్జట్ కు మించకుండా గ్రామానికి సంబంధించిన పనులన్ని చేసుకొనేదానికి భిన్నంగా ఈ Block Councils జోక్యం కల్గించుకునే అధికారం కల్గిఉంటాయి అంటే సరాసరి ప్రజలచే ఎన్నుకోబడిన పంచాయితీ బోర్డులపైన పరోక్షంగా ఎన్నుకొనబడినటువంటి ఈ Block Council కు ఈ అధికారాలిచ్చినట్లయితే ఈ పంచాయితీలనుకూడా రద్దుచేసే దానికొరకే ఆఅధికారాలు ఉపయోగిస్తాయి కాబట్టి ఇది ప్రజా పరిపాలనను విస్తృతంచేయడంకాదు, స్థానిక స్వపరిపాలనను విస్తృతంచేయడంకాదు, ఉన్నకాస్తనూ కూడా రద్దుచేయడమే నన్నమాట సరాసరి ప్రజలచే ఎన్నుకొనబడకుండా పరోక్షంగా వచ్చే Block Councils వాటిపైన అంతకన్న పరోక్షంగా ఎన్నుకోబడిన జిల్లా కౌన్సిల్స్, వాటిపై సరాసరి ప్రజలచే ఎన్నుకొనబడినటువంటి Assembly, మంత్రివర్గం అనేవి ఉన్నాయి అంటే గ్రామాలలో ప్రజలు ఎన్నుకుంటారు, రాష్ట్రాలలో ప్రజలు ఎన్నుకుంటారు. ఈ రెండింటికి మధ్యన, అంతాకూడా indirect గా ఎన్నుకోబడిన వాళ్ళుంటారు కొన్ని స్థలాల్లో M L As. ఉంటారు, కొన్ని కొన్ని స్థలాల్లో పంచాయితీ బోర్డుల అధ్యక్షులు ఎన్నుకొన్నవా రుంటారు వీళ్ళతో Block Councils, జిల్లా కౌన్సిల్స్ ఏర్పరుస్తారు వీళ్ళందరికీ కూడా ఉద్యోగస్థుల మీద పెత్తనం యిస్తామంటున్నారు. అసలు ఉద్యోగస్థుల ప్రాధాన్యత చాలా ఉంది. క్రిందనుంచి పైవరకు ఈ ఉద్యోగస్థుల ద్వారానే పరిపాలన సాగుతుంది. ఉద్యోగస్థులను అదుపులో పెట్టగలశక్తి సరాసరి ప్రజలచే ఎన్నుకోబడినటువంటి ప్రతినిధులకు తప్పితే పరోక్షంగా వచ్చేటటువంటి యితరుల దయాదాక్షిణ్యాల మీద ఆధారపడవలసినటువంటి వ్యక్తులకు ఉండదు.

ప్రభుత్వంవారు ఇచ్చిన వైట్ పేపరులో కొన్ని కౌన్సిల్సును సూచించారు దీనివల్ల పరిపాలనా సౌలభ్యాన్ని, ప్రజాప్రాతినిధ్యాన్ని స్థానిక స్వపరిపాలనను నామమాత్రంచేసి దాదాపు లేకుండాచేసి ఉద్యోగస్థులు పరిపాలన సాగించే స్థితివస్తుంది జిల్లాబోర్డులు తమ కర్తవ్యాన్ని సరిగా నిర్వర్తించ లేక పోయినవని మంత్రిగారు చెప్పారు ఇంతకుముందు మాట్లాడిన కొంతమంది గౌరవసభ్యులు జిల్లాల వైశాల్యములు చాలా ఎక్కువగా ఉన్నందువల్ల జిల్లా బోర్డులు వాటి కర్తవ్యాలను సరిగా నిర్వర్తించలేక పోయినవని అన్నారు అంతేకాకుండా డబ్బు లేకపోయినందు వల్లకూడా జిల్లాబోర్డులు నిష్ఫలమయ్యాయని కొందరు చెప్పారు అయితే ఈ జిల్లాబోర్డులకు ఉన్న అధికారాలు ఏమిటి ? రోడ్లనన్నింటి నీహైవేస్ డిపార్టుమెంటువారు తీసుకున్నారు ఇరిగేషన్ మొదలైన విషయాలు చీఫ్ ఇంజనీరుగారి చేతులలో ఉన్నాయి ఆసుపత్రులు, మెడికల్ ఆఫీసర్సుక్రింద ఉన్నవి విద్యవిషయాలు ఎడ్యుకేషనల్ ఆఫీసర్సు క్రింద ఉన్నవి స్థానిక పరిపాలన ప్రజాప్రతినిధులకు ఇవ్వవలసినది పోనిచ్చి దానిని ప్రభుత్వమే తీసుకొని ఉద్యోగస్థులచేత నడిపించడానికి పూనుకోవడం వలన జిల్లాబోర్డులు నిరుపయోగమై ఏపనీ చేయలేకుండా పోయినవే తప్ప ఇంకో కారణంకాదు సరాసరి ప్రజలచేత ఎన్నుకొనబడిన ప్రతినిధులు సక్రమముగా నడుపలేదు వారికన్న ఉద్యోగస్థులే మెరుగు- ఏదో పరీక్ష పాస్ అయి వచ్చినవారుకనుక ఉద్యోగస్థులు నిష్పక్షపాతంగా ఉంటారు ప్రజల కష్టసుఖాలు తెలుసుకుంటారు వారిద్వారా పరిపాలనచేస్తే ఎంతో సమర్థంగా ఉంటుంది. కాని ప్రజలచేత ఎన్నుకొనబడిన వారిచేత పరిపాలన చేయిస్తే సమర్థంగా ఉండదు అని ఒక నిర్ణయానికి వచ్చినట్లున్నది ఉద్యోగస్థులమీద ప్రభుత్వానికి ఎంత నమ్మకము ఉన్నదో ప్రజలచేత ఎన్నుకోబడిన ప్రతినిధులమీద ఆమాత్రం లేక వాళ్ళను రద్దుచేసే కార్యక్రమానికి పూనుకున్నది ఇదే ప్రభుత్వ దృక్పథం ఐనట్లయితే వారు రాష్ట్రంలోని ఉద్యోగస్థులను అదుపులో పెట్టి పనిచేయించలేరని నేను మనవి చేస్తున్నాను. క్రింది ఆఫీసులలోఉన్న ఉద్యోగులపై అదుపు లేకుండా ఎప్పుడు చేస్తారో అప్పుడు "మంత్రులుకూడా ౩ సంవత్సరాలో, ౫ సంవత్సరాలో ఉంటారు వాళ్ళు శాశ్వతము కాదు. మేము శాశ్వతముగా ఉంటాము, మంత్రులు వస్తుంటారు, పోతూ ఉంటారు, శాశ్వతముగా పరిపాలన చేసే వాళ్ళము మేము" అనేటటువంటి దృక్పథము వాళ్ళకుకలిగి వాళ్ళు ప్రభుత్వంవారి మాటలను కూడా లెక్కచేయరు. ప్రభుత్వంమీద చాలా వినయ విధేయతలుఉన్నట్లుగా కనుపించినా ప్రభుత్వం వెనకాలవాళ్లు యిష్టంవచ్చినట్లుగా కార్యక్రమం చేసుకోవడం సంభవిస్తుంది. ఏ చిన్న సమస్యవచ్చినా యీనాడు మంత్రులదగ్గరకు రావలసివస్తున్నది. పంచాయితీకి సంబంధించినా, తాలూకాకు

సంబంధించినా, జిల్లాకు సంబంధించినా ప్రతివారు మంత్రులదగ్గరకు రావలసివస్తున్నది ఉద్యోగస్తులు చాలా అవకతవకలు చేస్తున్నారు కాబట్టి ఈ విధముగా రావలసి వస్తున్నది శ్రీకాకుళం జిల్లానుంచి, అనంతపురం జిల్లానుంచి వచ్చిన వారు మాట్లాడుతూ మీరు ఏమిచేసినా చేయకపోయినా యీ స్పెషల్ ఆఫీసరు యొక్క అధికారం తీసివేయండి అని చెబుతున్నారు. మనము దేశంనుంచి తరిమివేసిన బ్రిటిష్ సామ్రాజ్యవాదులు ఉన్నరోజులలో ఉన్న స్థితికన్న అధ్వాన్నముగా ఉన్నదని దేశస్వాతంత్ర్యంకోసం పోరాడిన అనేకమంది శాసన సభ్యులే మాట్లాడినారంటే ఎందువల్లనో ఆలోచించుకోవాలి ఉద్యోగస్థులు ప్రజా ప్రతినిధులు చెప్పిన దానిని లక్ష్యము చేయకుండా వాళ్ళ ఇష్టం వచ్చినట్లుగా అధికారాన్ని చెలాయిస్తున్నారు కాబట్టి యీ విధముగా చెబుతున్నారు దీనిని అరికట్టడానికి మార్గము ప్రజలచేత ఎన్నుకొనబడిన జిల్లాబోర్డులను పునరుద్ధరణ చేయడం వాటికి ఇంకా ఎక్కువ అధికారాలు ఇవ్వటమే ఎప్పుడో అధికారాలు ఇస్తామనే దానికన్న ఇప్పుడే వెనువెంటనే అధికారాలు ఇవ్వాలని చెబుతున్నాను యీ జిల్లాబోర్డుల ద్వారా ప్రజలలో ఎక్కువ సన్నిహిత తత్వం ఏర్పరచుకోవడానికి ప్రయత్నం చేయాలి బొంబాయి ప్రభుత్వంవారు జిల్లాబోర్డులను యథాతథంగా ఉంచి సరాసరి ఎన్నికలు జరిపి- వాటి క్రింద బ్లాక్ కౌన్సిల్సు ఉన్నవా, లేవా అన్నప్రశ్న లేదు - వాటిని నిర్వహిస్తున్నారు ప్రభుత్వానికి గ్రామ పంచాయితీలమధ్య ప్రజలచేత సరాసరి ఎన్నుకొనబడిన ఒక కమిటీ ఉండాలని ప్రభుత్వ ఉద్దేశం అది జిల్లాబోర్డుగా ఉండాలని వారు చెప్పారు బల్వంతరాయి మెహతా కమిటీ రిపోర్టు వచ్చిన తరువాత మైసూర్ ప్రభుత్వంవారు ప్రభుత్వానికి పంచాయతీలకు మధ్య ప్రజలచేత సరాసరి ఎన్నుకొనబడిన ఒకకమిటీ ఉండాలి అని, అది తాలూకాబోర్డు అని అన్నారు. వారు జిల్లా కౌన్సిల్సును నామమాత్రం చేశారు నేను బాంబే ప్రభుత్వం గాని, మైసూరు ప్రభుత్వం గాని చేసినది సరిగా ఉన్నదని అనుకోవడంలేదు తాలూకా స్థాయి పరిపాలన, జిల్లా స్థాయి పరిపాలన అని గ్రామానికి, ప్రభుత్వానికి మధ్య రెండు అంతరువు లున్నప్పుడు, ఎన్ని అంతరువులు ఉంటాయో, ఎన్ని అంతస్థులు ఉంటాయో అక్కడక్కడ ప్రజలచే ఎన్నుకోబడిన ప్రజాప్రతినిధి సభ ఉండాలి. ఆ సభలు చెప్పినరీతిగా ఆ లెవెల్ లో ఉన్న ఉద్యోగస్థులు అంతా పనిచేయాలని నేను చెబుతున్నాను. అదే సరయిన స్థానిక స్వపరిపాలన తప్పితే ఇంకొక పద్ధతివల్ల అది సాధ్యపడదు కాని మన రాష్ట్రంలో యీ రెండు స్థాయిలలో కూడా ఎన్నికలు లేకుండా చేశారు ఎన్నికలు అంటే ప్రభుత్వం భయపడుతున్నది. ఎన్నికలు లేకుండా ఏదో పరోక్షముగా తమ ఉద్యోగస్థుల ద్వారా, లేదా కొందరు పెద్దమనుష్యుల

ద్వారా యీ పరిపాలన చేదామని భావించి ప్రజలమీదవిశ్వాసం ఉంచి, ప్రజాస్వామికముగా అధికారాన్ని డీసెంట్రలైజ్‌చేయక పోవడం వల్ల ప్రజలే తమ పనులను చేసుకోవడానికి వీలు లేకుండా చేస్తున్నారు అందువల్ల ఇది స్థానిక స్వపరిపాలనను రద్దుచేయడం తప్పితే ఇంకొకటి కాదని నేను స్పష్టముగా చెప్పవలసి ఉన్నది ఈ వైట్ పేపరు ప్రకారం బ్లాక్ కౌన్సిల్సును ఏర్పాటు చేయదలచుకున్నారు అయితే ఇప్పుడున్న తాలూకాలు ఏమవుతాయి. తహశీల్‌దార్లు ఏమవుతారు వాళ్ళకు బ్లాకులకు, సంబంధం ఏమిటి రెవెన్యూ డివిజనల్ ఆఫీసర్లు బ్లాక్ కౌన్సిల్సుకు అధ్యక్షులుగా ఉంటున్నారు డెవలప్‌మెంటు యాక్టివిటీస్ కు సంబంధించినంతవరకు యీ తహశీల్దార్లకు, ఆర్. డి ఓస్ కు అనేక అధికారాలున్నాయి. ఆ పనులు అన్నీ యీ బ్లాక్ కౌన్సిల్స్‌కో, జిల్లా కౌన్సిల్స్‌కో ఇచ్చినపుడు యీ ఉద్యోగస్థులస్థాయి ఏమిటి ? ఈ ఎడ్మినిస్ట్రేటివ్ సెట్‌అప్ ఏలాగ ఉంటుంది తాలూకా అలాగే ఉండి, జిల్లా అలాగే ఉండినట్లయితే ఇప్పుడు నాలుగు దొంతరలతో తంటాలు పడుతుంటే ఇంకో రెండుదొంతరలు అదనంగాకల్పించడం యుక్తముకాదు మంత్రుల దగ్గరకు రావాలంటే నాలుగుదొంతర్లు దాటివచ్చేవాళ్ళు ఇకముందు ఆరుదొంతరలు దాటితేనే కాని రావటానికి వీలుండదు. ఇది అనవసరమైనది బురాక్రసీ పరిపాలనా విధానాన్ని ఇంకా ఆలస్యం చేసేటట్లుగా పనికి వస్తుందేకాని ఇంకొకటికాదని నేను మనవిచేస్తున్నాను మేము తాలూకాలను రద్దుచేస్తున్నాం రెవెన్యూ డివిజన్ పరిపాలనా కేంద్రంకాదు జిల్లా కౌన్సిల్సు, బ్లాక్ కౌన్సిల్సు గ్రామపంచాయితీలు మాత్రమే ఎడ్మినిస్ట్రేటివ్ యూనిట్సు అని చెప్పినను కూడా ఇన్ని దొంతరలు అవసరం లేదని చెబుతున్నాను జిల్లా చాలా విస్తీర్ణముగా లేదు కాబట్టి జిల్లాబోర్డులను రద్దుచేస్తున్నాము అని చెబుతున్నారు ప్రజలచేత ఎన్నుకోబడిన జిల్లాబోర్డు పనికిరాదని చెబుతూ కలెక్టర్ దానికి స్పెషల్ ఆఫీసరుగా ఉండడంవల్ల నష్టంలేదని ప్రభుత్వంవారు అంటున్నారు స్పెషల్ ఆఫీసరుమొదలైన అధికారులను ఎంతత్వరగా ఊడబెరికితేఅంతమంచిదని చాలా మంది చెప్పారు. బ్లాక్ కౌన్సిల్సుపెట్టి జిల్లా కౌన్సిల్సు పెట్టి వాటికి సరాసరి ప్రజలచేత ఎన్నికలు జరిపించి అదేవిధంగా రాష్ట్రానికి ఎన్నికలు పెట్టినట్లయితే మన జీవితం అంతా ఎన్నికల మధ్యనే ఉంటుంది అని ప్రభుత్వంవారు చెబుతున్నారు. కాబట్టి ఇన్ని అంతరువులు అవసరం లేదని తేలుతున్నది నిజముగా బ్లాక్ కౌన్సిల్సు ఉండవలసిన అవసరం ఉన్నదా ? జిల్లా కౌన్సిల్సు ఉండవలసిన అవసరం ఉన్నదా అని అడుగుతున్నాను. ఏమైనప్పటికి పంచాయితీలు ఉండక తప్పదు రాష్ట్రస్థాయితో ఎన్నికలు తప్ప ఈ రెండింటికీ మధ్య రెండు అంతరువులు పెడుతున్నారు. ఈ నాడు ఎడ్మినిస్ట్రేటివ్ సెట్ అప్ ఈ రెండింటినీ ఇంటి

గ్రేట్ చేయవలసి ఉన్నది అయితే యీనాడు ప్రభుత్వం సూచించిన అంతరువులు ఉపయోగమా, అవసరమా అని అడుగుతున్నాను ఇవి అవసరము అని అనుకున్నట్లే అయితే వాటికి ఎన్నికలు జరుపవలెనే కాని వాటికి పరోక్షపు ప్రాచీనపు పద్ధతి పనికిరాదు. రెండింటికి ఎన్నికలు జరుపవలెనని అనుకున్నట్లయితే అది మాకుకూడా చాలా చిక్కుతో కూడుకున్న సమస్య ఈ పద్ధతిలో మంచి చెడ్డల నన్నింటిని సాకల్యంగా విచారించడానికి ఒక కమిటీని వేసినట్లయితే మనము అన్ని విషయములను చర్చించుకోవచ్చు ఇన్ని దొంతరులు ఉండనక్కరలేకుండా గ్రామం తరువాత, జిల్లా, ఆతరువాత రాష్ట్రం ఉండేటట్లుగా చేయవలసి ఉంటుంది అయితే జిల్లాయొక్క విస్తీర్ణం తక్కువ చేయాలి ఈనాడు 20 జిల్లాలు ఉంటే వాటిని 60, 70 జిల్లాలుగా చేయవచ్చు ఈ రెండు స్థాయిలలోను ఎన్నికలు ఒక స్థాయిలో మాత్రమే అంగీకరిస్తాము అని చెప్పినట్లయితే అప్పుడు తప్పనిసరిగా జిల్లా స్థాయిలో ఎన్నికలు జరుపవలసిఉంటుంది కాని జిల్లా చిన్న జిల్లాగా ఉండవలసివస్తుంది ఆ జిల్లాకు 3 లేక 4 లక్షల జనాభా ఉండవచ్చు జనం ఎక్కువగా కేంద్రీకరించి ఉన్నచోట్ల 5 లక్షల జనాభా ఉండవచ్చు తక్కువ జనాభా ఉన్నచోట్ల 3 లేక 4 లక్షలనుండి ఉండవచ్చు కాని పరిపాలనా సౌలభ్యంకోసం ఒకే అంతరువు ఉండాలనీ చెబుతున్నాను మేము రెండు అంతరువులు పెడుతాము రెండింటికి ఎన్నికలు జరపడానికి ఎన్నికలు పెట్టను స్థానిక స్వపరిపాలనకు స్వస్తిచెబుతాము అంటే మేము ఏమాత్రం అంగీకరించము అని మనవి చేస్తున్నాను 20 జిల్లాలను 60 జిల్లాలుగా గానో, 70 జిల్లాలుగానో చేయమని, వాటికి అధికారాలు ఇచ్చి, ఉద్యోగస్థులు వాటిక్రింద పనిచేసేటట్లు చూడమని చెబుతున్నారుకాని, యీనాడు జిల్లా అనేటప్పటికి కలెక్టర్ కావాలి అప్పుడు డబ్బు ఎక్కువ అవుతుంది బిల్డింగులు కట్టాలి అని చెప్పవచ్చు కాని ప్రభుత్వం ఈ ఆలోచనలను మార్చుకోవాలి ఈ నాడు ఆర్ డి. ఓ. లు ఉన్నారు వారికి ఎన్నో అధికారాలున్నాయి వారి అధికారాలను డిసెంట్రలైజ్ చేసి ప్రజల చేత ఎన్నుకోబడిన ప్రతినిధుల కంట్రోల్ లో వాళ్ళు పనిచేసేటట్లు చేయమని కోరుతున్నాను కాని ప్రతి జిల్లాలో కొత్త బిల్డింగులు కావాలనిగాని, కొత్త ఉద్యోగస్థులు కావాలనిగాని నేను చెప్పడంలేదు.

బిల్డింగ్సుకట్టి, ఉద్యోగస్తులను వేసి, బ్లాక్ కౌన్సిల్సులో ఈరోజున చేస్తున్న విధంగా పరిపాలనాయంత్రం తలబరువుగా చేయకూడదు ఉన్నదానిలో అధికారాలు వికేంద్రీకరణంచేసి ప్రజలయొక్క యాజమాన్యం క్రింద check up చేసుకొనేరీతిగా చేయకపోతే పరిపాలన తలబరువు అవుతుంది. స్థానిక పరిపాలన

కొనసాగించటం అసంభవం అవుతుంది ఈ రోజున Blocks లో Village level workers అని Block officers అని, Social Education Organisers అని—ఉన్నారు వీరు చాలక యింకా మరికొంత మంది ఉద్యోగస్తులను వేయటం అనేది, ప్రజలుయిచ్చేడబ్బు పరిపాలనా యంత్రానికి ఖర్చుపెట్టుటకు తయారవు తున్నారు తప్పితే, యింకొకటి ఏమీకాదనే విమర్శ ప్రజలనుంచి వస్తున్నది పంచాయితీ బోర్డులు ఏర్పాటు చేసినప్పుడు, సెకండ్ క్లాస్ పంచాయతీలను క్లబ్ చేసి Executixe Officers ను పెట్టాలని ఒక సూచన ఉన్నది ఇప్పటికే తాలూకా లెవెల్‌లో తాశిల్దార్లు, ఆఫీసర్లు, అయిదారు రకాలున్నారు వీరు గాక రివిన్యూ డివిజనల్ ఆఫీసరును తాలూకా లెవెల్‌లో పెడదామా ? జిల్లాలెవెల్‌లో పెడదామా ? పోస్టుబాక్సు క్రింద పెడుతున్నాము అనే విషయం ఒకటి ఉన్నది జిల్లాలో యిన్నిరకాల set-ups పెట్టేటప్పటికి ఉద్యోగస్థుల బృందం ఎక్కువగుతున్నది ఇప్పుడు కావలసినది ఎక్కువమంది ఉద్యోగస్థులు కాదు Technicians, Engineers, Veterinary Doctors, Doctors, Agronomists, వ్యవసాయ నిపుణులు యిటువంటివారు కావాలని ప్రజలు కోరు తున్నారు Adminstrators చాలామంది ఉన్నారు, గ్రామపరిపాలన చేసుకొన గలమని, జిల్లాకు కావలసిన పరిపాలన చేసుకొనగలమని ప్రజలు అంటున్నారు అందుకు ప్రజలచేత ఎన్నుకొనబడినవారు చాలామంది వున్నారు. కాంగ్రెసు పార్టీలో ఉన్నారు, కమ్యూనిస్టుపార్టీలో ఉన్నారు, సోషలిస్టుపార్టీలో ఉన్నారు ఏ పార్టీకి చెందినటువంటి వారైనాసరే, యీ పరిపాలన చేసేవారు ఉన్నారు Specialised knowledge, skilled knowledge దేశాభివృద్ధికి కావలసినటువంటి knowledge ఉన్నవారు ఈ రోజున ప్రత్యేకంగా కావాలని అడుగుతున్నారు కాబట్టి పరిపాలనా దొంతరలు పెంచకుండా, యిప్పుడున్న దొంతరలతో, ప్రజాప్రతినిధులు గల బోర్డ్సు ఏర్పాటు చేయటమే సరైనపద్ధతి జిల్లా వైశాల్యం ఎక్కువ ఉంటే తగ్గించండి, ఒక జిల్లాబోర్డు చాలదనుకుంటే, రెండు మూడుగాచేసి వికేంద్రీకరణం చేయండి, ఇప్పుడు వెంటనే జిల్లాబోర్డు ఎలెక్షన్సు పెట్టండి, ఆ బోర్డ్సుకు సర్వాధికారాలు యివ్వండి, అని చెపుతున్నాను కేంద్ర ప్రభుత్వంవారి Nationl Extension Service Schemes, C D Blooks, వీటిలో వారు చెప్పిన పద్ధతిగా సిబ్బంది లేకపోతే వారు డబ్బు యివ్వరనే సమస్య వస్తుంది, ఆ డబ్బు తెచ్చుకొనుటకు పంచాయితీలు ఏర్పాటుచేసి, వాటికి అధి కారాలు యిచ్చి, డబ్బు సక్రమం చేసేలోపల యీ బ్లాక్సులో కొంతైనా పని జరుగుతున్నది కాబట్టి, ఈ జరుగుతున్న పనిని పోగొట్టుకొనకుండా, తాత్కాలి కంగా బ్లాక్సును అట్లాగే కంటిన్యూ చేయవచ్చును అవి కంటిన్యూ చేసేటప్పుడు ఉన్న పంచాయితీలనుంచి కోఆప్ట్ చేసుకొనో, లేనిచోట్ల గ్రామస్థులను సంప్రదించి

కొందరు పెద్దలను తీసుకొనో తాత్కాలికంగా బ్లాక్ కౌన్సిల్సును సాగించాలి తప్పితే యిప్పుడు ప్రభుత్వం సూచించే రీతిగా బ్లాక్ కౌన్సిల్సు, జిల్లా కౌన్సిల్సు ఉండాలని, administrative set-up పర్మినెంటుగా చేస్తామని, ఎన్నికలు జరుపం అని చెప్పుట స్థానిక పరిపాలనను ఖూనీ చేయుటతప్ప, యింకొకటికాదు అందు చేత మంత్రిగారు ఆ దృష్టితో చేస్తామంటే ఉపయోగంగా ఉంటుంది అది ఏమీలేకుండా జిల్లాబోర్డ్సును స్పెషల్ ఆఫీసర్సుతో కొనసాగిస్తామనే సూచన మేము ఎంతమాత్రం అంగీకరించము ఇప్పుడు ఒకటి రెండు సవరణలు 'మార్చి నెలాఖరువరకు' అని ఉన్నవి Immediate గా జిల్లాబోర్డ్సును ఆధారం చేసుకొని స్థానిక స్వపరిపాలన విస్తృతం చేయుటకు మార్చిదాకా టైమ్ సరిపో తుంది దానిని unanimous గా అంగీకరించి ఆ ప్రకారం చేయవచ్చును. అంగీకరించకపోతే, యివన్నీ సమగ్రంగా చేసి ఎప్పుడో తెస్తామంటే ఎప్పుడో తెచ్చేదానికి మేము తయారుగా లేము ఈ స్థానిక పరిపాలనను ఒక రకంగా ఖతం చేయటమో, లేక ఖూనీ చేయటమో, ముగించటమో- ఏమాట నచ్చితే అది తీసుకొనవచ్చును- ఆ పద్ధతిమాత్రం మేము అంగీకరించము అని తెలియ జేయటానికి ఈ బిల్లును వ్యతిరేకించక తప్పదు

*శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి అధ్యక్షా, ఈ చిన్నబిల్లుపై చర్చలో పదముగ్గురు సభ్యులు పాల్గొన్నారు కొన్నివిషయాలు జనరల్ గా కొంతమంది చెప్పటం సంభవించింది, ముఖ్యంగా రాజేశ్వరరావుగారు కమ్యూనిస్టుపార్టీ తరఫున చర్చను ప్రారంభిస్తూ కొన్నివిషయాలు చెప్పారు వారు చెప్పిన విషయాలకు రెండు మూడింటికి సమాధానము చెపితే, లేకపోతే సుందరయ్యగారు చెప్పి నటువంటి విషయాలకు రెండుమూడింటికి సమాధానము చెపితే, జనరల్ గా తెచ్చిన కొన్ని ప్రశ్నలకు సమాధానం చెప్పటం జరుగుతుంది ఇంకా గౌరవ సభ్యులు కొంతమంది చిన్నచిన్న సూచనలు చేశారు వాటికి వేరేసమాధానం చెప్తాను ముఖ్యంగా రాజేశ్వరరావుగారు కమ్యూనిస్టుపార్టీ తరఫున మాట్లాడుతూ ఈ decentralisation పద్ధతి—దీనిని devolution of authority అనండి, లేక యింకేమైనా అనండి—ఈ White Paper లో envisage చేసిన పద్ధతిని అంగీకరిస్తామని చెప్పారు, చాలా సంతోషమైనమాట అంతేకాకుండా కాంగ్రెసుసభ్యులు, యితరులు కూడా ఈ White Paper లో చూపించబడిన మార్గములు— decentralisation పద్ధతిని బలపరచటం చాలా సంతోషకరమైన విషయమని మనవిచేస్తున్నాను.

"ప్రస్తుతం ఉన్న జిల్లా బోర్డులు చాలా అన్‌వీల్డీగా ఉన్నాయి, ఫైనాన్స్‌లో చాలా వీక్‌గా ఉన్నాయి" అని వారు చెప్పారు వారు చెప్పిన దానితో ప్రభుత్వము ఏకీభవిస్తున్నది ఆ సంగతి మేము, యీ బిల్లులోగల 'ఆబ్‌జక్ట్స్ అండ్ రీజన్స్' లో చెప్పిఉన్నాము శ్రీ రాజేశ్వరరావుగారు శ్రీ సుందరయ్యగారు, ఇంకా ఇద్దరుముగ్గురు సోషలిస్టు సభ్యులు చెప్పిన ముఖ్యమైన విషయం "ప్రభుత్వం డైరక్ట్ ఎలక్షన్సు పెట్టటంలేదు" అని దానికి కాంగ్రెసు తరఫున రాజా సాగి సూర్యనారాయణ రాజుగారు మాట్లాడుతూ కొంతవరకు సమాధానం చెప్పారు డెమాక్రసీ కాస్ట్‌లీ మెథడ్ అన్నసంగతి మనకు తెలుసు దానిని మోర్ కాస్ట్‌లీ మెథడ్ చేయడం అన్నది న్యాయమైన విషయంకాదు మనం పంచాయితీలు ఏర్పాటు చేసుకోవటంలో, సభ్యుల దగ్గరనుంచి అధ్యక్షుల వరకు, అందరు డైరక్ట్ ఎలక్షన్స్‌లో పాల్గొంటున్నారు పంచాయితీలకు డైరక్ట్ ఎలక్షన్స్ జరుగుతున్నాయి శాసనసభలకు డైరక్టు ఎలక్షన్స్ జరుగుతున్నాయి పార్లమెంటు సభ్యులకు ఎలక్షన్స్ డైరక్టుగా జరుగుతున్నాయి కేంద్రానికి రాష్ట్రానికి సంబంధించినంతవరకు యీ డెమాక్రటిక్ పద్ధతిన ఎన్నికలు జరుపుకొంటున్నాము కాబట్టి, యీ రెండింటికి మధ్యగా ఉండే సంస్థలను లోకల్ యూనిట్స్‌ను యీవిధంగా నిర్మాణం చేసుకొంటే, "అక్కడ కూడ ఎందుకు డైరక్టు ఎలక్షన్ పెట్టలేదు" అని అనటం సబబుకాదని మనవి చేస్తున్నాను. సభ్యులందరకునేను "ఆబ్‌జక్ట్స్ అండ్ రీజన్స్" లో చెప్పిఉన్నాను ఈ జిల్లాబోర్డులకు, యీ స్థానిక స్వపరిపాలనా సంస్థలకు ఎన్నికల నిమిత్తల 30 లక్షలు ఖర్చుపెట్టటం న్యాయంకాదు ఆ విధంగా ప్రజలడబ్బును దుర్వినియోగ పర్చకుండా, అనవసరంగా ఎన్నికలకొరకు ఖర్చుపెట్టకుండా, ఆ డబ్బు ప్రజల ఉపయోగంకొరకు సద్వినియోగం చేయటం ప్రభుత్వ ఉద్దేశమని నేను మనవిచేశాను.

[*Mr. Speaker in the Chair*]

మనం "డెమాక్రసీ" అన్న పదంయొక్క అర్థం పొడిగిస్తే, లేక అపార్థం చేసుకుంటే, మనం చేసే ప్రతి శాసనమునకు ప్రజలదగ్గరకు పోయి అభిప్రాయము తెలుసుకొనే అవసరం ఏర్పడుతుంది. ఇక్కడ సభ్యులు ప్రజలయొక్క అభిప్రాయాన్నే తెలుపుతున్నారా, లేదా, అన్న మాటకూడ వస్తుంది

డెమాక్రసీలో మూడు ప్రధానఘట్టాలు ఉన్నాయి (1) లోకల్ యూనిట్స్ (2) స్టేట్ గవర్నమెంటు (3) సెంట్రల్ గవర్నమెంట్. ఈ మూడింటిని మనం డైరక్టు ఎలక్షన్స్ పద్ధతిన జరుపుకొంటున్నాము. ఈ డైరక్టు ఎలక్షన్స్ పద్ధతి అన్నది ప్రభుత్వముయొక్క ఉద్దేశముకాదు, సభ్యులు వైట్

పేపర్ గమనించినట్లయితే, అందులో చెప్పిన బ్లాక్ కౌన్సిల్‌లో ఎవరు సభ్యులుగా ఉంటారు? పంచాయితీ అధ్యక్షులు సభ్యులుగా ఉంటారు పంచాయితీ అధ్యక్షులు ఎవరు? నిన్నగాక మొన్న, ఆ గ్రామంలో ఉండే అందరిచేత ఎన్నుకోబడినవారు పంచాయితీ అధ్యక్షులు, అంతేగాని, వీరు ఆకాశంనుంచి ఊడిపడినారని, లేక గవర్నమెంటు ఎవర్నో తమనెత్తిన నామినేట్ చేస్తుందనిఅనుకోడం పొరబాటు ఆంధ్రరాష్ట్రంలో 1956 సంవత్సరం మధ్యనుండి పంచాయితీలకు ఎన్నికలు జరుపుతూవచ్చారు, ఈ రోజువరకు జరుపుతూ వస్తున్నారు నిన్నగాక మొన్న ఎన్నికలు జరిగి, ఆ ఎన్నికలలో ప్రజల విశ్వాసము సంపాదించుకొని ఎన్నికైన పెద్దమనుష్యులకు, గ్రామ పంచాయితీ అధ్యక్షులకు మళ్ళీ ప్రజాభిప్రాయంకోసం ఎన్నికలు జరపమనటము సరైందికాదు ఏ చిన్న మార్పు వచ్చినా, ప్రతి దానికీ ఎన్నికలు జరపమనటము అర్థరహితమవుతుందని నేను మనవి చేస్తున్నాను కొంతమంది సభ్యులు మాట్లాడుతూ "ఇవి నామినేటెడ్ బాడీస్" అంటున్నారు ఇక్కడ నామినేటెడ్ బాడీస్ అన్న ప్రశ్న అరైజ్ కాదు ఎందుకంటే, ప్రభుత్వము ఎవరిని నామినేట్ చేయటములేదు డిస్ట్రిక్టు కౌన్సిల్సులో గాని, బ్లాక్ కౌన్సిల్సులో గాని, ప్రభుత్వం ఏ నలుగురైదుగురినో నామినేట్ చేయటం అన్న పద్ధతి లేనేలేదు. సభ్యులు బ్లాక్ కౌన్సిల్స్‌కు ఎన్నికలు జరపాలన్నారు సభ్యులు దానిని ఆలోచిస్తే ఏమి అర్థమౌతోందని అడుగుతున్నాను సభ్యులు ఏమి చెబుతున్నారో నాకు అర్థంకావటంలేదు నలభై, ఏభయి గ్రామాలు ఉన్నాయి అనుకోండి. ఏ రెండు గ్రామాలకో ఒకరిని ఎన్నికయ్యేటట్లు పెట్టమంటారా? లేక గ్రామంనుంచి తిరిగి ఇంకొకరు ఎన్నిక అయ్యేవారిని పెట్టమంటారా? లేక మూడు, నాలుగు గ్రామాలకు కలిపి ఒకరిని ఎన్నుకొనేటట్లు పెట్టమంటారా? సభ్యులు ఏమి చెబుతున్నారో నాకేమి అర్థం కావటంలేదు నిన్నగాక మొన్న ప్రతి గ్రామంనుండి ప్రజలందరు ఎన్నుకొన్నటువంటి అధ్యక్షులను మనం బ్లాక్ కౌన్సిలు సభ్యులుగా పెడుతూంటె, వారు నామినేటెడ్ అవుతారని చెప్పటం సరైందికాదు అందులో కొన్ని పార్టీలయొక్క సభ్యులు ఎక్కువమంది లేకపోవచ్చును ఆ కారణంచేత వీరు నామినేటెడ్ పీపుల్ అని అనుకోవటం, ప్రజావిశ్వాసాన్ని సంపాదించుకొన్నటువంటి అధ్యక్షులకు మనం తప్పుచేసినవారమౌతామని నాఉద్దేశము కాబట్టి బ్లాక్ కౌన్సిల్సులో ప్రభుత్వము యొక్క జోక్యము ఏమాత్రము లేదు అక్కడ ఉన్నటువంటి పంచాయితీ అధ్యక్షులు దానికి సభ్యులు అవుతారు రేపు మనం ఏర్పరచబోయే పంచాయితీలలో అక్కడి ప్రజల విశ్వాసాన్ని సంపాదించుకొన్న అధ్యక్షులే సభ్యులు అవుతారు. కాబట్టి, బ్లాక్ కౌన్సిల్సుకు ఎన్నికలు జరుపుకోవాలని అనుకోవటం పొరపాటు అవుతుంది బ్లాక్ కౌన్సిల్సుకు ఎన్నికలు జరుపుకోవటం అనవసరమని

నేను మనవిచేస్తున్నాను "స్పెషల్ ఆఫీసర్సు యొక్క కాలాన్ని పొడిగించుకోటానికి, మెహతాకమిటీవారి సిఫార్సులను ఒక ఎక్స్‌క్యూజ్‌గా తీసుకొన్నారని, ఆవిధంగా వారి సిఫార్సులు ఉపయోగపడ్డాయని" అపోజిషన్‌లో ఉన్న కొంత మంది గౌరవసభ్యులు చెప్పారు అది చాలా విచారకరమైన విషయము మెహతా కమిటీ రికమెండేషన్స్ రాకపూర్వమే ప్రభుత్వము కొన్నాళ్ళుగా "యీ ఇంటర్‌మీడియెట్ సంస్థలు ఏ స్థాయిలో ఉండాలి, తాలూకా స్థాయిలో ఉండాలా, బ్లాక్ స్థాయిలో ఉండాలా, ఎట్లా ఉండాలి" అన్నది ఆలోచిస్తున్నది

సుందరయ్యగారు బొంబాయి, మైసూరు రాష్ట్రాల గురించి చెప్పారు కాని, మిగతా 12 రాష్ట్రాల సంగతి వారు చెప్పలేదు ఈ ప్రాథమికసూత్రాన్ని ఎక్కువ ప్రభుత్వాలు ఆమోదించిన సంగతి మనం పత్రికలలో చదివాము సుందరయ్యగారు ముఖ్యంగా బొంబాయి విషయం చెప్పారు దానిని గురించి నేను చెప్పటం భావ్యముకాదేమో వారు నిన్నగాక మొన్ననే జిల్లాబోర్డులకు ఎన్నికలు జరుపుకొన్నారు అందుచేత వాటిని కంటిన్యూ చేయటం మంచిదన్న నిర్ణయానికి వారు వచ్చిఉండవచ్చును ఈ మెహతాకమిటీ యొక్క సిఫార్సులు అనుకోండి, ప్రాథమికసూత్రాలు అనుకోండి, వీటిని దాదాపు అన్ని ప్రభుత్వాలు స్థూలంగా ఆమోదించినవి డిటెయిల్స్‌లో కొన్నిమార్పులుఉంటే ఉండవచ్చును ఆ డిటెయిల్స్ విషయం వచ్చినపుడు తప్పకుండా ఆలోచించుకోవటానికి అవకాశం ఉంటుంది,

ఇంకొక ముఖ్యమైన విషయము general గా సభ్యులు చెప్పింది ఏమిటంటే, ఇది కేవలం బ్లాకు కౌన్సిల్సు నిర్మాణము, జిల్లాకౌన్సిల్సు నిర్మాణము, ఏవి అయితే decentralization చేయాలని ప్రభుత్వము అనుకుంటున్నదో, అవి సాగవు, అవి యిప్పుడు officers యొక్క autocratic behaviour కు దోహదమిచ్చేవే గాని, లేకపోతే అవి democracy ను కొనసాగించేవికావు, వాటిద్వారా ప్రభుత్వము తలపెట్టే కార్యక్రమాలు సక్రమముగ జరగవు అని అన్నారు. కాని ప్రభుత్వము ప్రకటించిన White Paper ను గౌ॥ సభ్యులు మరొకసారి జాగ్రత్తగా చదువుకోవలసిందిగ మనవిచేస్తున్నాను ప్రభుత్వము యొక్క ఉద్దేశ్యం White Paper కు సంబంధించినంతవరకు ఏమిటో సభ్యులు గమనించితే బోధపడుతుంది ఈ బ్లాకు కౌన్సిలు అనేది Statutory Body యే దానికి ఆ బ్లాకుకు సంబంధించినంతవరకు సంపూర్ణమైన అధికారాలు ఉంటున్నవి ద్వితీయ పంచవర్ష ప్రణాళికకు జరిగేటటువంటి కార్యక్రమములు కాని, ఆ బ్లాకు పరిధిలో జిల్లా బోర్డులు ఇప్పుడు నిర్వహిస్తున్న కార్యక్రమాలుగాని, యింకను

యితర development కార్యక్రమములు గాని, నిర్వహించటానికి బ్లాకు కౌన్సిలుకు సంపూర్ణమైన అధికారాలు గలవు, అనేసంగతి మరిచిపోగూడదు ఇదివరకు ఉన్నది nominated body, అది strangle చేస్తారు, దానికి ఎక్కువ అధికారాలు లేవు అనేమాట సరియైనదికాదు అని మనవి చేస్తున్నాను. 50 యేసి, 60 యేసి గ్రామాలుకలిపి ఒక్కొక్క బ్లాకు కౌన్సిలును ఏర్పాటు చేస్తున్నాము బ్లాకు కౌన్సిల్సు సర్వాధికారాలు కలిగి ఉంటాయి ఒక గౌరవ సభ్యుడు మాట్లాడుతూ జిల్లా కౌన్సిల్సుకు బడ్జటు approve చేసే అధికారము ఉంటున్నప్పుడు, ఇక ఈ బ్లాకు కౌన్సిల్సు ఉండడము నిరర్థకమే అని చెప్పడం చాలా అతిశయోక్తిగా ఉన్నది ఆ జిల్లాబోర్డులను మరల ఎన్నికల ద్వారా పునర్నిర్మించితేనే మంచిదని అన్నారు ఇదిగాక జిల్లాబోర్డులయొక్క బడ్జటు ఇదివరకు ప్రభుత్వం approve చేస్తూ ఉండేదని, ఇప్పుడు ఆ అధికారము బ్లాకు కౌన్సిల్సుకే యివ్వడము అనేది strangle చేయడము తప్ప మరేమి కాదని, అందువల్ల యీ కౌన్సిల్సు నిరుపయోగ సంస్థలుగా చేస్తున్నారని కూడ అన్నారు కాని, యిది సత్యదూరమైన విషయం ఇదివరకు జిల్లాబోర్డుల బడ్జటు ప్రభుత్వము approve చేస్తున్నది అంటే, అది ఊరకనే ఒక formality యేనని అంటున్నాను అయినప్పటికినీ యీ బ్లాకు కౌన్సిల్సుద్వారా జిల్లాబోర్డు పనులు సర్వాధికారాలతో నడపడము, ప్రస్తుతం ఎట్లా పనిచేస్తాయో అని, యిది ఒక experiment క్రింద ప్రభుత్వం ఆరంభిస్తున్నది ఇది న్యాయమైన experiment దేశములో ఉన్న అన్ని రాష్ట్రాలలోను యిలాంటి experiment నే మొదలు పెట్టారు ఇది మన ఒక్క రాష్ట్రములోనే కాదు ఈ బ్లాకు కౌన్సిల్సులో ఆ ఏరియాలో ఉన్నస్థానిక ప్రజలయొక్క విశ్వాసము సంపాదించటానికి, పంచాయితీబోర్డు అధ్యక్షులను, యితర పెద్దమనుష్యులను యిందులో మెంబర్లుగాను, ప్రెసిడెంట్లుగాను ఏర్పాటు చేయడము జరుగుతున్నది గనుక. ఇదివారికి ఒక initiative గా ఉంటుంది అంతేకాకుండా public opinion galvanise చేయవలయునని గూడ ప్రభుత్వము యొక్క ప్రధానోద్దేశ్యము దీనివల్ల public support కూడా సేకరించటానికి అనువుగా ఉంటుంది ఈ కౌన్సిల్సు చేయవలసిన కార్యక్రమములు అధికార్ల ద్వారా సరిగా జరగవనే ఉద్దేశ్యముతోనే, స్థానిక ప్రజలయొక్క support తో యివి నిర్వహించాలనే ప్రభుత్వము యీ కౌన్సిల్సును అమలులోనికి తెస్తున్నది ఈ బ్లాకు కౌన్సిల్సు కాకుండా District Councils అని గూడ ఏర్పాటు చేయడము జరుగుతున్నది ఈ కౌన్సిల్సులో శాసనసభ్యులు, పార్లమెంటు సభ్యులు కూడ మెంబర్లుగా ఉంటారు. బ్లాకు కౌన్సిలులో ఎన్నికయిన వారిలో ఒకరు మంచి అనుభవము గలవారు చైర్మనులుగా ఉన్నవారుకూడ మెంబర్లుగా

ఉంటారు గనుక వారికి ఏదైనా అవసరమైన సలహా యివ్వటానికి అధికారాలు పెట్టాము దీనివల్ల బ్లాకు కౌన్సిల్సు యొక్కగాని, District Councils యొక్కగాని day-to-day administration లో interfere కావడము గాని, వారి యొక్క అధికారాలు strangle చేస్తూ, చేసేటటువంటి కార్యక్రమాలకు అడ్డుతగలడము కాని ఏమీ ఉండదు కొంతవరకు పని జరుగుతూంటే, యివి ఎట్లా పనిచేస్తాయో, సభ్యులకే బోధ పడుతుంది.

ఇది గాక గౌ॥ సభ్యులు యింకొక విషయము గురించి చెబుతూ, మరల యీ Special Officers యొక్క term of office పొడిగిస్తున్నారు మనం జిల్లా బోర్డుల యొక్క కార్యక్రమమును ఏ ఉద్యోగస్థుడైతే నిర్వహించకూడదు అని అనుకుంటున్నామో, మరలవానినే ఇందులోకి తీసుకొనివస్తున్నారు అనేమాట కూడ వచ్చింది గౌ॥ సభ్యులు ఒక్కసారి White Paper ను చిత్తగిస్తేతెలుస్తుంది, ప్రభుత్వము యొక్క ఉద్దేశ్యం కూడా ఈ Special Officers యొక్క పరిపాలన క్రమేణా తగ్గించాలనే అందుకనే White Paper లో చెప్పింది ఏమిటంటే ఎక్కడ అయితే Special Officers ప్రస్తుతము పనిచేస్తున్నారో, వారు ఈ బ్లాకు కౌన్సిల్సు ఏర్పడేటంతవరకుఉంటారు ఇవి ఏర్పడినతరువాత Special Officers యొక్క పరిపాలన తీసివేసి, శాసనసభ్యులతోను, పార్లమెంటు సభ్యులలోను, ఏ ఏ జిల్లా కౌన్సిల్సును అయితే నిర్మాణముచేయబోతున్నామో, వారుజిల్లాబోర్డు కార్యక్రమములను నిర్వహించేలాగు యివి చేస్తాయని పెట్టియున్నాము. అంటే Special Officers యొక్క పరిపాలన, రేపు దీనికి తీసుకునిరాబోయే Amending Bill వచ్చిన రోజునుంచి తగ్గిపోతుందన్నమాట ఏదైతే వారు పరిపాలన చేస్తున్నారో అందులో యిప్పుడు ఉన్న శాసనసభ్యులు, పార్లమెంటు సభ్యులు యీ బ్లాకు కౌన్సిల్సులోనుంచి ఏర్పడే అధ్యక్షులు యీ body యొక్క కార్యక్రమమును నిర్వహిస్తారు ప్రజలచే ఎన్నుకోబడిన పార్లమెంటు సభ్యులు, ప్రజలచే ఎన్నుకోబడినశాసనసభ్యులు, లేకపోతే బ్లాకుకౌన్సిల్సులో పంచాయతీ బోర్డుల అధ్యక్షులవల్ల ఎన్నుకోబడిన చైర్మను public opinion ను represent చేయరు. వారికి రెండు సంవత్సరాల క్రిందనే ఎన్నిక జరిగింది గనుక యిప్పటి వరకు public opinion వారు represent చేయుటను continue చేయరు అని అనుకోవడము చాలా పొరబాటు. అందువల్ల నేను మనవిచేసేది ఏమిటంటే, ఈ బ్లాకు కౌన్సిల్సును ఒక statutory అధికారిగాపెట్టి, జిల్లా కౌన్సిల్సు పెద్దల సలహా సంఘంగాను, ఒక Co-ordinating body గాను, Guiding body గాను పెట్టి తక్కినబ్లాకులు కూడ ఏర్పడే పర్యంతము, జిల్లాబోర్డుల కార్యక్రమాలను నిర్వహించాలనే పద్ధతితో జరపాలని ప్రభుత్వము ఆలోచించి పెట్టడము జరిగింది.

ఇవి general గా వచ్చిన విషయాలు గున్నయ్యగారు మాట్లాడుతూ జిల్లా కౌన్సిల్సులో స్త్రీలకు, Schedule Castes కు Tribal people కు representation ఉంచే బాగాఉంటుందని అన్నారు అది నిజముగ మంచిదేనని నేను అనుకుంటు న్నాను వారికి representation ఎట్లా యివ్వవలసిందన్న details ను గురించి మనము విచారించుకోవచ్చు కాని ప్రభుత్వము యీ నామినేషను పద్ధతి లేకుండా మరొకవిధముగ representation ఇచ్చేటట్లు గూడ మనము ఆలో చించుకోవచ్చు

KBR m/ Local Administration

శ్రీ రామమూర్తిగారు మాట్లాడుతూ 'ఎన్నికలకు అభ్యర్థుల జాబితాలు వగైరా ఏర్పాట్లు అన్నీ తయారుచేయించారు, దానిక్రింద డబ్బు ఖర్చుచేశారు, ఇంత ఖర్చుచేసిన తరువాత, జిల్లాబోర్డుల పునర్నిర్మాణముకొరకు ఎన్నికలు ఎందుకు జరిపించకూడదు'అనిఅన్నారు దానియొక్క details వారికి పూర్తిగా తెలియదని నేను అనుకుంటాను వారికి దానియొక్క information పూర్తిగా తెలియకపోయినందుననే వారావిధముగమాట్లాడారని నేను అనుకుంటున్నాను ఎన్నికల కొరకు ప్రభుత్వము డబ్బు ఏమీ ఖర్చుచేయలేదు కాకపోతే కొన్ని రిపోర్టులు వగైరాలు జిల్లాలనుంచి తెప్పించామే తప్ప, దానికిగాను ప్రత్యేకించి వేలు లక్షలు ఖర్చుచేసింది ఏమీలేదు. ఇదిగాక వారు యింకొక విషయము చెప్పారు ఇది ఒక political move అని వారు ఎట్లా అనుకుంటున్నారో నాకేమీ బోధపడడములేదు అయితే వారు యిది political move అయినప్పటి కినీ, యిది ఒకవిధముగమంచిదేనని అన్నారు సంతోషము అందుకు వారికి నా ధన్యవాదాలు

తరువాత కల్లూరు సుబ్బారావుగారు మాట్లాడుతూ, ఏవరో కొంత మంది opposition సభ్యులు చెప్పినట్లుగా, యీ జిల్లాకు కౌన్సిల్సును మెహతా సిఫార్సులను శిఖండిగా ఉపయోగిస్తున్నామని అన్నారు వారి ఉద్దేశ్యము నిజ ముగ అదికాదు అని అనుకుంటాను. అది ఏదో ఒక సామెతకొరకు మాట్లాడా రేమోగాని, అది fit అవుతుందా, కాదా అనేది వారు బాగా ఆలోచించి అన లేదేమో అనుకుంటాను ఏమైనప్పటికినీ, సుబ్బారావుగారు ఒకసూచన చేశారు. ఈ జిల్లా కౌన్సిల్సుకు Elected Chairman ఉండాలని అన్నారు. ఈ విషయ మునుకూడ ప్రభుత్వం ఆలోచిస్తుంది ఇది ఎంతవరకు న్యాయమో, ఎంతవరకు వీలు అవుతుందో ఆ details అన్నిటినీ ప్రభుత్వము పరిశీలిస్తుందని మనవి చేస్తున్నాను.

తరువాత మహాబూబ్ అలీఖాను గారుకూడా ప్రభుత్వము యొక్క ఉద్దేశ్యమునే బలపరచారు.

తరువాత మన వావిలాల గోపాలకృష్ణయ్యగారు మాట్లాడుతూ వారి యొక్క చక్రమును జిల్లాబోర్డుల Special Officers క్రింద పనిచేసే P As మీదుగా పోనిచ్చారు ఈ P A లు సక్రమంగా పనిచేయడములేదని, అసలు Special Officers ప్రజాభిప్రాయముల కనుగుణ్యంగా ప్రవర్తించడము లేదని ప్రజలు ఉద్దేశిస్తున్నారని అన్నారు అందువల్లనే వారి యొక్క పరిపాలన తీసివేసి, వారి స్థానములో జిల్లా కౌన్సిల్సు యొక్క పరిపాలన జరపాలనే ప్రభుత్వము ఉద్దేశిస్తున్నదని నేను మనవిచేస్తున్నాను కొంతమంది సభ్యులు మెహతాగారి సిఫార్సులుకూడ ప్రభుత్వము పాటిస్తున్నదా, ప్రభుత్వము బొక్కసములోనుంచి ఈ బ్లాకు కౌన్సిల్సుకు, యితరులకుకూడ డబ్బుఖర్చు చేయాలని అన్నారుగదా, ఆ విషయములో ప్రభుత్వము ఏమి ఆలోచిస్తున్నదని అడిగారు ఈ విషయము కూడ ప్రభుత్వము యొక్క ఆలోచనలో ఉన్నది. ప్రభుత్వము యొక్క బొక్కసములోనుంచి ఎంతఖర్చు చేయటానకి వీలు అవుతుందో ప్రస్తుతము నేనేమీ చెప్పలేను కొంతవరకు White Paper లోనే వ్రాసియున్నది ఇంకను ఏమైనా యివ్వటానికి వీలు అవుతుందేమో, ప్రభుత్వము యొక్క ఆర్థిక పరిస్థితినిబట్టి ఆలోచించుకుని ఏర్పాటుచేయవలసిన విషయము అది

తరువాత శ్రీ ఎ. బి నాగేశ్వరరావుగారు యీ బిల్లును బలపరుస్తూ ఒక technical objection ను raise చేశారు "ఈ బిల్లు ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్ లో వున్న 11 జిల్లాబోర్డుల Special Officers యొక్క పదవీ కాలాన్ని పొడిగించడానికే అయినప్పుడు దీనిని ఎందుకు Andhra Pradesh Amending Bill అన్నారు ?" అని అడిగారు దానిలో లోపమేదైనా వుందేమోనని అధికారుల సలహా తీసుకున్నాను "మన ఆంధ్రప్రదేశ్ ఏర్పడిచి తరువాత ఏ బిల్లు వచ్చినప్పటికీ అది The Andhra Pradesh Amending Bill గా ఉంటుంది" అని వారన్నారు కాబట్టి కొన్ని ప్రాంతాలకు అన్వయించినా అన్వయించక పోయినా దీనిని స్థూలంగా Andhra Pradesh Amending Bill అనే అవాలి తరువాత శ్రీ ప్రగడ కోటయ్యగారు "దీనికి ఆరేండ్లు పడుతుంది" అన్నారు ఆరేండ్లు పట్టవలసిన అవసరంలేదు ఇప్పటికి 185 Blocks అయిపోయాయని అందరికీ తెలిసిన విషయమే. ఇంకా 200 Blocks కు పైగా కావలసి వున్నాయి. ప్రతి సంవత్సరం మనం షుమారు 70 Blocks చొప్పున చేస్తున్నాం. ఈ Blocks వచ్చినకొద్దీ Block Councils ఏర్పడతాయి. ఏ ప్రాంతాలకైతే ఈ Block

Councils ఏర్పడవో వాటికి District Councils కూడా అధికారంలో వుంటాయి ఇంకోమాటకూడా చెప్పారు "Block Councils ను అధికారంలో ఉండనిచ్చి అక్కడవారు అధికారం చెలాయిస్తూ కొదమ ప్రాంతము విద్యా శాఖవారికి, రహదారుల శాఖవారికి ఎందుకు అధికారం యివ్వకూడదు ?" అంటున్నారు అది కొంచెం retrograde step యేమోనని నాకు భయముగా వుంది ఈ వున్న కాస్త అధికారము District Councils నుంచి రావలసిన అవసరం ఏర్పడుతుందని మనవిచేస్తున్నాను

శ్రీ ఏ బి నాగేశ్వరరావు నేను clarification అడిగాను ఈ బిల్లు తెలంగాణాకు వర్తించదు కదా, తెలంగాణాలో వున్న 9 జిల్లాబోర్డులు యేమవుతాయి ?

శ్రీ కె బ్రహ్మానందరెడ్డి తెలంగాణా విషయంలో 1956 వ సంవత్సరంలో జిల్లాబోర్డు చట్టం ఒకటి చేశారు. ఆ చట్టప్రకారం వెనుకవున్న nominated జిల్లాబోర్డులు, క్రొత్తచట్టప్రకారం ఎన్నికలు జరిగి, మరల కొత్తసంస్థలు పనిచేసేవరకూ వుంటాయని దానిలో వుంది కాబట్టి ప్రభుత్వం క్రొత్త Act క్రింద ఎన్నికలయినా జరపాలి, లేకపోతే దానిని amend చేసే బిల్లును తెచ్చి యీ కార్యక్రమంతో పాటు జోడించనైనా జోడించాలితప్ప వేరే అగత్యములేదు తీసుకుపోయి ఉద్యోగస్థులచేతులలో పెట్టినట్లవుతుందేమో ఆలోచించాలని మనవి చేస్తున్నాను తరువాత సోషలిస్టుపార్టీకి చెందిన శ్రీ రాజుగారు మాట్లాడుతూ, "జిల్లాబోర్డులు చాలా మంచిపని చేశాయి" అన్నారు. నేను వారితో ఏకీభవిస్తున్నాను అప్పటి రోజులలో అప్పటికున్న డబ్బును బట్టి, అవసరాలను బట్టి సక్రమమైన పని చేశాయని నేను ఒప్పుకుంటున్నాను వారు సక్రమమైన పని చేయలేదని ఎక్కడా లేదు కాని వున్నటువంటి పరిస్థితి యేమిటంటే జిల్లాబోర్డులకు elastic sources of revenue లేవు Elementary education grant అనీ, road grant అనీ, ప్రభుత్వం అనేక రూపాలలో యిచ్చే విరాళంపైననే వాటి జీవితం ఆధారపడివుంది రానురాను వాటి బాధ్యతలు పెరుగుతున్నాయి ఇదివరకు మైలుకు రు 200 రూపాయలిస్తే రోడ్ల maintenance అయిపోయేది. ఇప్పుడు రెండువేల రూపాయలిచ్చినా నిర్వహణ కావడంలేదు. High schools ఎక్కువయినాయి ప్రాథమిక పాఠశాలలెక్కువయినాయి వైద్యశాలలెక్కువయినాయి. దీనికి తగిన ఆర్థిక పరిస్థితి వారికి లేదు. అయితే, ప్రభుత్వం ఎందుకు యివ్వకూడదనే ప్రశ్న అడుగవచ్చు ప్రభుత్వపు finances కి కూడా limitations వున్నాయి ఏ చిన్న పన్నుల బిల్లు తీసుకువచ్చినా, "వారిపైన

ఎందుకు పన్ను వేస్తున్నారు? వీరిపైన పన్ను ఎందుకు వేస్తున్నారు?" అనే మాటలను తమరే వింటున్నారు ఒక వైపున పన్నులు ఏ మాత్రమూ వేయకూడదని అంటూ, మరొక వైపున "ఈ కార్యక్రమం చేయలేదు, ఆ కార్యక్రమం చేయలేదు, జిల్లాబోర్డులకు డబ్బుయివ్వాలి" అంటే సమన్వయం కుదరదు శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు గ్రామంలో వచ్చే revenue అంతా పంచాయతీలకే యివ్వాలి" అని అంటున్నారు పన్నుల ప్రతిఘటనకూ, కార్యక్రమాల అభ్యర్థనకూ సమన్వయం కుదరదని అర్థం చేసుకోవాలి ఊరికే మాటలకొరకు చెబితే ప్రయోజనం లేదనేది కూడా గ్రహించవలసి వుంటుంది శ్రీ సుందరయ్యగారొకటి రెండు మాటలు చెప్పారు నేను యిదివరకే సమాధానం చెప్పాను, వారు, "ఈ జిల్లా బోర్డులు యిప్పుడున్న development కార్యక్రమాలతో unwieldy bodies అనుకుంటూ మీరు ఎందుకు ఇతర అధికారాలను District Councils కు యివ్వాలనుకుంటున్నారు? అవికూడా unwieldy కావా?" అన్నారు అది సక్రమమైనది కాదు మరొకసారి ఆ line ను చదువుకోమని ప్రార్థిస్తున్నాను

"The State Government will in due course devolve in the District Councils progressively the powers now exercised by the Government through the district officers"

Therefore, there is no contradiction, Sir అందుకని నేను మనవి చేసేది యేమిటంటే మెహతాకమిటీ సిఫార్సులను excuse గా తీసుకోవాలనేది ప్రభుత్వదృష్టి కాదు ఇవి decentralize కావాలి ఇవి decentralize అయిన తరువాతనే, ప్రజలయొక్క ఉత్సాహాన్ని మనం తీసుకున్న తరువాతనే యీ కార్యక్రమాన్ని నెరవేర్చగలుగుతామనే దృఢనిశ్చయంతో యీ కార్యక్రమం ముందు పెట్టాము తప్ప Special Officers యొక్క పదవీ కాలాన్ని పొడిగించడానికి యిదియొక సాకు కాదు శ్రీ సుబ్బారావుగారు చెప్పినట్లు యిది 'శిఖండి' కాదు. అందుచేత యీ బిల్లుకు ఆమోదం యివ్వవలసినదిగా కోరుతున్నాను.

*Mr. Speaker:* The question is:

"That the Madras District Boards (Andhra Pradesh Amendment) Bill, 1957 be taken into consideration at once."

The motion was adopted

*Mr. Speaker:* I shall take up the Bill clause-by-clause now. There are two amendments to clause 2 I shall first put the amendment of Sri B Sriramamurthy to vote.

*Clause 2*

*Sri B Sriramamurthy* I beg to move

"That in clause 2, for the words '10th December 1958' substitute the words '10th February 1958' "

*Mr Speaker* Motion moved

( Pause )

*Mr Speaker* The question is

"That in clause 2, for the words '10th December 1958' substitute the words '10th February 1958' "

The motion was negatived

*Sri B Sriramamurthy* I demand a division, Sir

The House then divided

Ayes . 40 Noes .. 74

The motion was negatived.

*Sri Vavilala Gopala Krishnayya* I beg to move

"That in clause 2, for the words '10th December 1958' substitute the words '31st March 1958' "

*Mr Speaker* Motion moved

( Pause )

*Mr. Speaker* The question is ;

"That in clause 2, for the words '10th December 1958' substitute the words '31st March 1958'. "

The motion was negatived.

*Sri Vavilala Gopala Krishnayya* I demand a division, Sir.

The House then divided

Ayes . 39 Noes . 75

The motion was negatived.

*Mr Speaker* The question is

"That Clause 2 stand part of the Bill"

The motion was adopted

Clause 2 was added to the Bill

*Clause* 1

*Mr. Speaker* The question is

"That Clause 1 stand part of the Bill"

The motion was adopted

Clause 1 was added to the Bill

*Preamble*

*Mr Speaker* The question is .

"That the Preamble stand part of the Bill"

The motion was adopted

The Preamble was added to the Bill

*Sri K Brahmananda Reddi* I beg to move

"That the Madras District Boards (Andhra Pradesh Amendment) Bill, 1957, be passed into law"

*Mr Speaker* Motion moved

శ్రీ పి సుందరయ్య అధ్యక్షా! మంత్రిగారు చెప్పిన విషయాలు విన్నాము కాని ఏమాత్రం సంతృప్తికరముగా లేవు వారేమీ కొత్తవిషయములు చెప్పలేదు "ఈ బ్లాకులకు ఎట్లా ఎన్నికలు జరగాలి," అని వారు ప్రశ్నించారు బ్లాకులు అవసరంలేదు పంచాయితీలనే జిల్లాలక్రిందకు చేర్చాలని మేము చెబుతున్నాము కాని దానికి వారు సమాధానము చెప్పరు ఒకవేళ బ్లాకులు అవసరమయితే ఎన్నికలు జరుపక తప్పదు పరిపాలనకు బ్లాకులు అవసరము అని చెప్పటానికి ఒక కమిటీని వేయమని చెప్పాము ప్రతిపక్షంవారు ఏమి చెప్పినా మేము చేయదలచుకొన్నవిధముగా చేస్తాము, వారు చెప్పింది వినము' అని లక్ష్మణదాసుగారు చెప్పారు. బ్లాకులు అవసరమయినప్పుడు 40 లక్షలు ఖర్చుయినా తప్పక ఎన్నికలు జరపాలి పంచాయితీలకు ఎన్నికలు జరుపుతున్నప్పుడు వాటితోపాటు జిల్లాబోర్డులకు, రాష్ట్రి ఎసెంబ్లీకి, పార్లమెంటుకు అన్నిటికీ ఒకేసారి ఎన్నికలు జరిపితే తక్కువడబ్బు ఖర్చు అవుతుంది. అలా ఒకేసారి

జరిపితే పార్టీకి, వ్యక్తికికూడ ఎక్కువడబ్బు ఖర్చుకాదు మావద్ద డబ్బులేదు, ఎన్ని
కలు జరపటం లేదు అని చెప్పటానికి వీలులేదు జిల్లాకౌన్సిల్స్‌లో M L A లు
M P లు వుంటారని చెప్పారు M L A లు నాలుగు నెలలు అసెంబ్లీలో
కూర్చుని శాసనాలు చేయవలసివుంటుంది అట్లాగే M P లు పార్లమెంటులో
8 నెలలు కూర్చుని పనిచేయవలసి వస్తుంది అందుచేత ఆపని చేస్తూ మళ్ళీ ఈ
జిల్లాబోర్డులలో సక్రమంగా తమ బాధ్యతను నిర్వహించాలంటే శక్తి వున్నా
వారికి time ఉండదు అందుచేత స్థానికంగా వచ్చే సమస్యలను స్థానికంగా
ఎన్నుకోబడేవారే పరిష్కరించాలి, రాష్ట్ర సమస్యలపై M L A లు All
India మొత్తముమీద M P లు తమ బాధ్యతను నిర్వర్తించాలని ఇలా పరి
పాలనలో అంతస్థులు పెట్టటం జరిగింది అలా కాకుండా వారే పంచాయితీలను
జిల్లాబోర్డులను నడపాలంటే అది నలుగురు అయిదుగురివల్ల అయ్యేదికాదు
M L A లను M P లను పెడుతున్నాముకాబట్టి అది సవ్యముగా నడుస్తుం
దనే వాదన సరయినదికాదు M L A లు, M P లతోపాటు జిల్లా ఆఫీ
సర్లుకూడా వుంటారని వ్రాశారు అంటే M L A లకు, M P లకు ఏ అధి
కారములు వుంటవో ఆ ఆఫీసర్లకు కూడా ఆఅధికారాలు (ఓటింగ్ అధికారం)
వుంటాయని నేను అనుకోంటున్నాను వారు advisers గా వుంటారని ఇందులో
లేదు వారికాహక్కు లేదని మంత్రిగారు ఒప్పుకొన్నా M L A లు M P లు
పనిచేయటం సాధ్యంకాదు ప్రత్యక్ష ఎన్నికల పద్ధతి లేకపోతే ఈ "స్థానిక
స్వపరిపాలన" అనేది అర్థంలేని పనిగా వుంటుంది వున్నజిల్లాబోర్డులను రద్దుచేసే
పరోక్ష ఎన్నికలద్వారా ఏదో స్థానిక స్వపరిపాలన తెస్తామనేమాట అర్థ రహి
తంగా వుందికనుక మేము ఈ బిల్లును వ్యతిరేకించక తప్పదు.

శ్రీ బి శ్రీరామమూర్తి అధ్యక్షా! మొదటనుండి పెద్దపొరపాటు జరుగుతూ
వస్తున్నది ప్రజాస్వామ్యం వుంటే ఎన్నికలు వుండి తీరుతాయి ఎన్నికలు జర
గాలి అంటే డబ్బు ఖర్చు అవుతుంది ఈ ఖర్చు లేకుండా చేయాలంటే ఎన్నికలు
లేకుండా చేయాలి అంటే ప్రజాస్వామ్యమే లేకుండా చేయాలి అందుచేత
ప్రజాస్వామ్యం వుండాలా? దానికి అవసరమైన వాటికి ఖర్చు తగ్గించి ప్రణాళి
కను నడిపించటమా? అన్నది ముఖ్యమైన సమస్య ప్రజాస్వామ్యమును నిర్మూలం
చేస్తేగాని అభ్యుదయకరమైన ప్రణాళికను అమలు చేయలేమనే మన స్తత్వము
ప్రభుత్వమునకు వున్నట్లయితే అది తీవ్రమైన పరిణామాలకు దారి తీస్తుంది.

ప్రజాస్వామ్యము, వికేంద్రీకరణ అనే ప్రధాన ప్రాతిపదికలమీదే క్రొత్త
సమాజాన్ని నిర్మించటానికి పూనుకొన్నామని మనము పదేపదే ప్రకటనలు

చేస్తున్నాము అవే ఆశయాలు ఈ White Paper లో కనబడుతున్నాయి మెహతాకమిటీ రిపోర్టును అనుసరించి వచ్చిన White Paper గా ఇది వుంది ఈ కమిటీ రిపోర్టు మీద ప్రభుత్వానికి ఎటువంటి దృక్పథము వున్నదో ఎవరికి తెలియదు ఈ శాసనసభముందు అది లేదు అందుచేత మెహతా కమిటీ ప్రభుత్వమునకు వున్న ఖచ్చితమైన దృక్పథంను శాసనసభ్యులకు అందచేయటం అవసరంగా భావిస్తున్నాను అది జరిగితే కాని రాబోవు నూతన వ్యవస్థకు ఏ స్వరూపాన్ని స్పష్టముగా చిత్రించాలో ఆలోచించటానికి వీలులేదు ఎన్నికలకు ఖర్చు తగ్గించటానికే ఈ క్రొత్తవిధానం కనిపెట్టవలసివచ్చిందనే తత్వం సరైనది కాదని మేము అభిప్రాయపడుతున్నాము ఒక సంవత్సరం గడువు అడుగుతున్నారు కనుక అంతలోపు ఎన్నికలు కావని, ఈ Bodies ఏర్పడవని మాకు అనుమానం కలుగుతున్నది ఈ సంవత్సరములోగా C D Block లుగాని, లోకల్ బాడీస్‌గాని నిర్మింపబడవేమోననే అనుమానముకూడా నాకు వున్నది అందుచేత ఈరోజు ప్రభుత్వము ఒక విషయమును ముఖ్యముగా గమనించవలసి వుంది జిల్లా level లో Administative body వుండి తీరాలి కాబట్టి, Local Administration ను రాష్ట్రములో 42% వున్న కమ్యూనిటీ బ్లాకులద్వారా కాకుండా జిల్లాలో ప్రజలచేత ఎన్నుకొనబడిన జిల్లాబోర్డులద్వారా నిర్వహించాలని కోరుతున్నాను

ప్రభుత్వానికి మేము చెప్పిన పద్ధతులు యిష్టంలేకపోతే, మన దేశములో C D. Blocks ఏర్పడినప్పుడు వాటి functions కొన్ని పోతేపోవచ్చు కాని ముందుగా జిల్లా స్థాయిలో Local Administration నిమిత్తం definite గా ఒక administrative body ఉండితీరాలి ప్రభుత్వం తిరిగి ఆలోచించవలసి యున్నది.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య అధ్యక్షా! తమరు అమెరికా సంయుక్తరాష్ట్రములు అని ఒక పుస్తకం వ్రాశారు అది చదివినాను

శ్రీ కె. వెంకటరావు అది ఒక్కటేకాదు, ఇంకా చాలా వ్రాశారు.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య చాలా వ్రాశారు అన్నీ చదివినాము కాని యిప్పటి సందర్భం :

అమెరికాలో ప్రజలు ప్రెశిడెంటును ఎన్నుకున్నారు. అప్పుడు ఇంగ్లీషు వారు "మీరు అంతడబ్బు ఖర్చుచేసి ఎన్నుకుంటారు ఎందుకు? మాకు ఒక్క

రాజుతోనే సరిపోతున్నది" అన్నారు అమెరికా ప్రెశిడెంటు ఎన్నికకు అయ్యే ఖర్చు, రాజుగారిని నిర్వహించడానికి అయ్యేఖర్చు ఈ రెండూచూస్తే బహుశః అమెరికా ప్రెశిడెంటు ఎన్నికకే ఎక్కువడబ్బు ఖర్చవుతున్నట్లు తెలుస్తోంది

"Whatever the cost may be, we want Democracy, not Bureaucracy, or Autocracy" అన్నారు వారు ఇప్పుడు అదే జ్ఞాపకం వస్తున్నది ఎన్నికలకు ఎంతఖర్చు అవుతుందనేది ప్రజాస్వామ్యంలో లెక్కలేదు. అది తప్పితే మనకు యింకొక పద్ధతి ఏమివున్నది? ఎన్నికలు లేకుండా ప్రజల దగ్గరకు పోకుండా జరిగేదేమి ఉంది? అందువల్ల ఎన్నికల ఖర్చులు ప్రధానమనేది ఎప్పుడూ కాదు

బల్వంతరాయ్ మెహతాగారి రిపోర్టు ఆంధ్రజనతలో వేశారు అందులో పంచాయితీసమితియొక్క జిల్లా స్థాయీ ఉద్యోగుల ఓటింగుహక్కులేకుండా జిల్లా పరిషత్తులో సభ్యులుగా ఉండాలని మేము అనడం లేదు' అని చెప్పారు దీనిని బలపరుస్తూ "the powers exercised by the Government differ The Government will, in due course devolve on the District Councils progressively powers now exercised by the Government through the District Officers" అన్నారు.

ఈ రెంటినీకలిపి చదివినట్లయితే, వారు ఎప్పుడూకూడా అక్కడే వుంటారనీ, వారు తప్పకుండా ఓటు యిస్తారనీ తెలుస్తోంది ఈవేళవరకూ District Planning Committees అనుభవాలు తీసుకొంటే ప్రతి సందర్భంలోకూడా వారే decision యిస్తున్నారు ఈనాడు ప్లానింగు కమిటీలలో ఏమి జరుగుతున్నదో మనకు తెలుసు. 2 నెలలకు ఒకసారి meeting అయినా కూడా శాసన సభ్యులు అసెంబ్లీలోఉంటే ఆపివేయవలసి వస్తున్నది పార్లమెంటు సభ్యులు రావడానికి వీలులేకపోతోంది 'మేము రాలేనిస్థితిలో ఉన్నా'మని అంటున్నారు ప్రజాప్రాతినిధ్యపు హక్కు పోయిందని కాదు. మనం రాష్ట్రప్రభుత్వ విధానాన్ని అమలు జరపడానికే గాని, జిల్లా పరిపాలనలోపాల్గొంటే నూతనంగా వచ్చే వారికి ప్రజాపరిపాలన చేయడానికి అవకాశాలు ఎక్కడ ఉన్నాయి? ప్రజాస్వామికం కావాలంటే జిల్లాబోర్డులు కావాలి ప్రజలు, సామాన్యయువకులు, కొత్తగా వచ్చినవారికి Administrative experience కావాలంటే యిప్పుడు జిల్లాస్థాయిలో ఉంటే రేపు పార్లమెంటుకుగాని అసెంబ్లీకిగాని పోయినప్పుడు experience తో పనిచేస్తారని మేము యిదివరకే చెప్పాము ఇప్పుడు వారినందర్ని deprive చేసినట్లు అవుతుంది. మనకు అక్కరలేనటువంటి స్థానిక వ్యవహారాలలో

జోక్యం కలిగించుకొంటే చాలా కష్టం అవుతుంది కనుక వీటిని విస్తృతంచేసి లేదా ఇప్పుడున్న జిల్లాబోర్డులను అట్లాగే అట్టేపెట్టి, విస్తృతాధికారాలు యిప్పించండి. అప్పుడు రెండింటికీ సరిపోతుంది, తేలిక అవుతుంది కనుక ఈ విషయమై వెంటనే ఆలోచించాలని కోరుతూ దీనిని వ్యతిరేకిస్తున్నాను

శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి అధ్యక్షా! గౌరవ సభ్యులు మొదట చర్చలో చెప్పిన విషయాలనే తిరిగి చెప్పారు, కాబట్టి నేను ప్రత్యేకంగా సమాధానం చెప్పవలసిన అగత్యం లేదనుకుంటాను శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య గారు, శ్రీ రామమూర్తిగారు democracy అంటే ఏమిటో చెప్పారు నా ఉద్దేశంలో democracy కి అది సరైన అర్థం కాదు, విపరీతార్థమవుతుంది ప్రతి దానికీ direct elections పెట్టడం డెమాక్రసీయొక్క పద్ధతి కాదని నేననుకొంటున్నాను ఇంతకంటే యిప్పుడేమీ చెప్పనవసరం లేదు

*Mr Speaker*. The question is

That the Madras District Boards (Andhra Pradesh Amendment) Bill, 1957 be passed into Law

The motion was adopted

*The House then adjourned till Half Past Eight of the Clock on Saturday, the 15th November, 1957.*